*Approved for School use by the Madras Text-Book Committee, Fort St. George Gazette, 9-11-1937, Page 594.*

# Girija Kalyanam




*By*

MOCHERLA RAMAKRISHNAIAH, B. A

*Published by:*

VADLAMUDI RAMAYYA.

KRISHNA MANDIRAM STREET,

NELLORE.



MOCHERLA RAMAKRISHNAIAH, B.A.

# అనుక్రమణిక

—)o(—

# INTRODUCTION

Ancient Hindu Epics and classic Sanskrit *Kavyas* have an everlasting interest and attraction for Indian scholarship and poetic talent. Quite in our own day, there have been three Telugu metrical translations of the *Ramayana* and at least one of the *Mahabharata* which appears to hail on a more ambitious outfit than that of NANNAYA BHATTA and TIKKANA SOMAYAJI.

KALIDASA is the most admired and favoured among the later classic poets barring the Epic writers. Telugu can justly pride itself in about half a dozen renderings, if not more, of his *Sakuntala*. *Raghuvamsa*, *Meghasandesa*, *Kumara Sambhava* and *Ritu Samhara* have also within recent years adorned the Telugu Muse in multiples.

*Kumara Sambhava*, on which the present work is based and modelled, is in some editions extending over seventeen cantoes but tradition has credited only the first seven or eight with the genuineness of the imprimatur of KALIDASA—

a position strengthened by the circumstance that the commentary of the indefatigable scholiast, MALLINADHA, also extends only so far. The theme of this composition, as conceived by the great master-poet, starts from a combined request of all the Devas addressed to Bramha, the Creator, for a leader and commander of the angelic forces to war against and destroy the Titan Tarakasura and his hosts. The artistic consummation of the conception of such a plot may well be achieved and perfected by the wedding of the Divine Pair, the World-Parents, Parvati and Parameswara, and need not go down to the narration of the physical embodiment of the Divine Spirit into a son. The connubial function is pictured in Canto VII and even the next Canto may in a view be regarded as super-numerary but it may in another aspect be tolerated as a harmless appendage to the previous one.

There is reason to hold that *Kumara Sambhava* might have come after *Raghuvamsa* and *Sakuntala*. These two latter works begin with invocatory and prefatory verses and, by way of humility, offer apologies for the great poet's venture over them. In *Kumara* as in *Megha*, the subject is directly approached without any intervening expatiations. The following extracts, among

many others, should furnish some suggestive internal evidence of parallelism in ideas and diction between this work and the other two named above :—

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| Ashtamoorthi | Kumara-C. | 1 | V | 57 | Sakuntala | A 1, V 1 |
| Thrimoorthi | „ | 2 | „ | 4 | Raghu | C 10, V 16 |
| Kuberaguptam | „ | 3 | „ | 25 | Raghu | C 9, V 25 |
| Srungena Samsparsa | „ | 3 | „ | 36 | Sakuntala | A 6, V 17 |
| Yadha Prasiddhaiah | „ | 5 | „ | 9 | Sakuntala | A 1, V 19 |
| Metaphor of Balakini | „ | 7 | „ | 39 | Raghu | C 11, V 15 |
| Veera Prasava | „ | 7 | „ | 87 | Sakuntala | A 4 |

The productions of great poets are so close-knit and well-set that it is generally impossible to remove a word from its place and find a fitting substitute for it. This seems to have been realised by the masters themselves For instance, Verses 5 to 15 of Canto VII *Raghhvamsa* appear to have been, more or less, bodily imported into Canto VII of *Kumara Sambhava* and re-numbered as 46 to 56. This argues no weakness or defection in the poet but should largely contribute to enhance his reputation. Where a poet has to describe the same thing over again, he may as well choose *mutatis mutandis* to repeat what has been already said in a similar situation rather than try to find out new vocabulary for the same idea for the new occasion. It is well known that VALMIKI

is fond of making such repetitions. So great a canonist and purist of the stamp of *Bhavabhuti* has regaled himself in such a repetition in *Mahavira Charitam* and *Uttara Rama Charitam* when he had occasion to introduce a pair of bachelors. The first pair consists of Rama and Lakshmana and the second, Kusa and Lava, but the same descriptive verse was pressed into service for both the sets—Chuda Chumbita etc., etc.

The work before us, as mentioned at the outset is an adaptation of *Kumara Sambhava* into mellifluous Telugu prose. It follows the original close on its heels, although in deference to the modern puritanic disaffection towards personal descriptions, minute references to bodily charms and well shaped limbs are avoided. The author, Mr. MOCHERLA RAMAKRISHNAYYA (Pleader, Nellore), has already placed his credentials before the Telugu literary world by his *Maruthi*, *Prachanda Bhargavam*, *Atma Bhodha* (a free and faithful translation of Sankara's philosophical work of the same name), *Ramana-Ananda Lahari*, besides innumerable smaller poems composed for special occasions and events. He has rightly chosen the delightful title 'GIRIJA KALYANAM' for this work.

His admiration for the original was such that when he reached the narrative of the Devas waiting on Bramha for the boon of Mahasena, the leader of the celestial armies, he suddenly burst into beautiful inspired verse. His prose is as chaste as it is delicious. One may as well say that it reads as racy poetry in prose garb. The young author deserves all encouragement for further development in his literary achievements.

NELLORE<br>
7—6—37.

**O. Venkata Rangayya.**



# పండితాభిప్రాయములు

—(o)—

(1)

విమర్శకాగ్రేసర :

బ్రహ్మశ్రీ నాగపూడి కుప్పుస్వామయ్యగారు, బి. ఎ.,

*of the Telugu Board of Studies,*

*Madras University.*

"I have looked into it.......... .................. (గిరిజా కల్యాణము) and find it very well written in chaste and flowing style—a feature so rare now-a-days. I have no doubt your work will be appreciated by the Telugu reading public.

(2)

**M. R. RY PINGALI LAKSHMIKANTHAM GARU, M. A.,**
*Chairman, Telugu Board of Studies,*
*Andhra University, Waltair.*

"మీ 'గిరిజా కల్యాణము' తుదిదాక చదివితిని. చాల బాగుగా నున్నది. మూలములోని సొగసు కొంచెమేని చెడకుండ, ధారాళమైన శైలిలో కాళిదాసుని శ్లోకములను మీరు తెనిగించిన సరణి చాల ప్రశంస్యముగా నున్నది. విద్యార్థులు మీ పుస్తకమును చదివి, కాళిదాసుని కవితామహత్త్వమును గుర్తించుటే కాక, నిర్దుష్టమైన భాషయు అలవర్చుకొందురని నమ్ముచున్నాను."

(3)

అభినవతిక్కన బిరుదాంకితులు - విమర్శవిద్యాస్వతంత్రులు :
బ్రహ్మశ్రీ దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు,
*Senior Telugu Pandit, V. R. College, Nellore;*
*Member, Academic Council,*
*Andhra University.*

"శ్రీయుతులు చిరంజీవి మోచర్ల రామకృష్ణయ్య, బి. ఏ. గారు రచించిన 'గిరిజా కల్యాణము' కుమారసంభవములోని కాళిదాసుని యుదాత్తభావములఁ దెలుపునదియై ధారాళమైన శైలిగలిగి హృదయంగమముగా నున్నది. ఇది వచనరచన యలవఱుచుకొనఁగోరు ఆంధ్రవిద్యార్థులు పలుమాఱు చదువఁదగిన యుత్తమ గ్రంథమని నా యభిప్రాయము. ఇట్టి రచనల రామకృష్ణయ్యగారు ఇంకను గావించి యాంధ్రభారతి నలంకరింతురుగావుత. రామకృష్ణయ్యగారు కాళిదాసకృతిని పద్యముగానే యనువదించియున్న, నది యింకను పండిత పరితోషకరముగా నుండెడిది."

(4)

**కవితిలక - కవితావిశారద - విద్వాన్ :**

కంచనపల్లి కనకమ్మగారు,

*Lecturer, Queen Mary's College, Madras.*

మోచర్ల రామకృష్ణకవి విరచిత

గిరిజాకల్యాణ ప్రశంస.

---

చ॥ సరసులు దంతపుష్టి సర
సంబగు నిక్షువుఁ జించి చీల్చి లో
ని రసము గ్రోలనేర్తు; రది
నేరని వారికి నేరొయాప్తు లె
క్కరణినొ, తద్రసంబు చష
కంబున నించి యొసంగునట్లు మో
చరల కవీశుఁడిచ్చెఁగవి
చంద్రుని వాగ్రస మాంధ్రపాళికిన్.

శా॥ శీలన్ రెండవకావ్యమందు మును, గా
ళిదాసుఁ డాద్యంపు వా
గ్జాలంబం దెది యుంచె నద్ది, గిరిజా
కల్యాణమన్ గ్రొత్తసీ
సాలో దించెను రామకృష్ణకవి స
చ్చెలిన్ నవీనాంధ్రు లెం
తో లాలింపఁగ హృద్యగద్యమున నీ
యుర్విన్ జిరస్థాయిగన్.

"సింహపురి":

"ఈకావ్యము సంస్కృత పదార్థము మిక్కుటముగా నున్నందున మెడను గంటలు గట్టిన యాఁబోతువలె సశబ్దముగను, ప్రౌఢయగు కాంతవలె నిశ్శంకముగను, మదించిన యేనుఁగువలె నుద్ధతముగను నడచు చున్నది. భావరసభరితత్వముచే జీవమును జవమునుగలిగి వెలయు చున్నది."

---

ANDH
22
7

# గిరిజా కల్యాణము.

——):o:(——

కవితయను రత్నగర్భకు
ధవుఁడై వాల్లభ్యసంపదన్ సంస్కృతవా
గ్భువనము నేలిన స్వామిన్
స్తవమొనరించెదను గాళిదాస కవీశున్.

అతని కుమారసంభవము
  హాఖనిలోని యమూల్యరత్న సం
తతులను దీసి కూర్చితి, ని
  దంనిభహారముగాఁగ నాంధ్రభా
రతి కనురక్తి; నీ యుడుగ
  రన్ గొని, నాపయి నామె సత్కృపా
మృతరసబిందువుల్ చిలుక
  రించెడుఁ గావుత మెల్లవేళలన్.

# గిరిజా కల్యాణము

## —: పార్వతి జననము :—

——):o(——

ఒకవైపునఁ దూరుపుసంద్రము వఱకును వేఱొక ప్రక్కఁ బడమటికడలి దనుకను వ్యాపించి నేలకుఁ గొలతకఱ్ఱయోయన వెలయువాఁడును దేవతాత్మకుఁడును హిమాలయ నామప్రసిద్ధుఁడు నగు నగాధిరా జుత్తరదిశం గలఁడు. ఇతనినే వత్సముగాను మేరువును దోగ్ధగాను జేసి పృథుచక్రవర్తి యుపదేశమున భూదేవతనుండి భాస్వద్రత్నములను మహౌషధములను శైలము లెల్లను బితికించి కొంపోయినవి. మితిలేని రతనములకు నిదానమైన హిమవంతునకు మంచు సౌభాగ్య విఘాతకము కాలేదు. ఇందుకిరణములలోఁ గళంకమువలె గుణసముదాయమున నొక దోషము మునిఁగిపోవును గదా!

అకాలసంధ్యనుంబోలెఁ దన శిఖరములం దాల్చిన సిందూరగైరికాదులచే మబ్బుతెరలకు రాగముం గూర్చుచు హిమవంతుఁ డచ్చరలను విభ్రమాలంకరణధారణమునకుం బ్రేరించుచుండును. కాంచీప్రదేశముపర్యంతము సంచరించు

మేఘముల సానుగతచ్ఛాయల విశ్రమించు సిద్ధులు వానలచే నుద్వేజితులై యాతపవంతములగు హిమవచ్ఛృంగముల నాశ్రయింతురు. ఏనుఁగులఁ జంపిన పంచాస్యముల పాదన్యాసస్థానములు తుషారనిష్యందసంక్షాళితశోణితములైనను హిమవన్నగ వనచరులగు కిరాతులు తన్నఖరంధ్రోణినిర్ముక్తముక్తాఫలములచే నా సింహములజాడలం దీయఁదురు. గుహాముఖమున నుత్పన్నమైన సమీరణముచేఁ గీచకరంధ్రభాగములఁ బూరించుచు హిమవంతుఁడు గాంధర్వగ్రామమునఁ బాడు కిన్నరులకు శ్రుతి వేయువాఁడువలె శోభిల్లుచుండును. ఏనుఁగులు తమ చెక్కిళ్లదురదవో రుద్దిన దేవదారుతరువులనుండి స్రవించిన పాల వలపులు హిమవంతుని సానువులను సురభీకరించుచుండును. పగటి గిలినొందినదోయన, గుహలలో దాఁగిన చీఁకటిని హిమవంతుఁడు చీఁకటి గొంగనుండి కాచుచుండును. ఉన్నతులకు సజ్జనునియందువలె, శరణాగతులకు క్షుద్రులయందును మమత్వముండును గదా!

లాంగూలవిక్షేపములచే వెన్నెలజోతులవలె వ్యాపించు కాంతులతో నొప్పారు చమరీమృగవాలవ్యజనములచే హిమవంతుని గిరిరాజశబ్దమభిధేయవంత మగుచుండును. గంగాప్రవాహశీకరముల మోచి తెచ్చుటచేఁ జల్లనై, మాటిమాటికిం గదల్పఁబడిన దేవదారువులనుండి స్రవించు పాల వాసనలచేఁ గమ్మనై,

మృగములను వెదకివెదకి యలసిన బోయల మొలలనున్న నెమిలి పురుల నిప్పాటకును వారు సేదదేరుటకును మాత్ర మనువైనంత మందమై, మారుత మా నగరాజుం గొల్చు చుండును. ఆగిరి శేఖరుని యగ్రమునంగల కొలఁకుల కమలము లలో సప్తర్షులు తాము కోసికొనిపోవ మిగిలినవానిని దిగువ మెలఁగు కమలాప్తుఁడు తన యూర్ధ్వముఖ మయూఖములచే వికసిల్లఁ జేయును. అట్టి హిమవంతుని సోమలతాది యజ్ఞ సాధననిదాన తత్త్వమును భూభారధరణయోగ్యతను బ్రహ్మ తెలిసికొని స్వయముగా నతనికి యజ్ఞభాగమును శైలాధిపత్య మును గల్పించెను.

ఇతనికి మేరువు చెలికాఁడు. పితృదేవతల మనస్సంకల్ప మున జన్మించి మహర్షులకు సైతము మాననీయమై తన కను రూపమై సర్వశుభలక్షణ సంపన్న యని యెన్నికగన్న మేనక యను కన్నియను మర్యాదాభిజ్ఞుఁడగు హిమవంతుఁడు విధ్యు క్తముగా వివాహమాడెను. కాలము జరుగఁగా నా మేనకా హిమవంతులకు మైనాకుఁడను కుమారుఁడు జనించెను. పాకశాసనుఁడు పర్వతములకుఁ బరిపంథియై తత్పక్షముల విచ్ఛేదింపఁ గడంగిన కాలమున మైనాకుఁడు సాగరముం జొచ్చి వాసవుని వజ్రక్షతమునుండి తప్పించుకొని వర్ధిల్లు చుండెను.

శివుని ప్రథమభార్య సతీదేవి దక్షప్రజాపతి కూఁతురు. పితృగేహమునం గల్గిన యవమానముచేఁ బ్రేరింపఁబడి యామె యోగ విసృష్టదేహయై పునర్జన్మమునకై మేనకాదేవిం జేరెను. సాధ్వాచరణముచే నపరిక్షతమగు నీతియం దుత్సాహశక్తిచే సంపద యుత్పాదితమగు కరణి హిమవంతునిచే నియమవతియగు మేనకయం దాకల్యాణి జనన మొందెను.

ఆమె జన్మదినమున దిక్కులు ప్రసన్నములయ్యెను. గాలి దుమారము లేనిదయ్యెను. విరులవాన కురిసెను. శంఖధ్వనులు భూనభోంతరము నిండెను. చరాచరములగు సర్వప్రాణులకును సుఖము గలిగెను.

నవమేఘశబ్దమువలన మొలచిన రత్నపు మొలకచే నద్రిసమీపభూమివలె నుల్లసత్ప్రభామండలశోభితయగునా దుహితచే జనయిత్రియగు మేనకాదేవి ప్రకాశించెను.

లబ్ధోదయ యగు చంద్రరేఖ కౌముదీమయములైన వేఱు వేఱు కళలచే వృద్ధిఁ బొందుచందంబున నవయవలావణ్య విశేషములచే నాబాల దినదిన పరివర్ధమానయగుచుండెను. బాంధవప్రీతిపాత్రయగు నాపసిపాపను జుట్టములభిజ నాగతమగు 'పార్వతి' యనుపేరఁ బిలువంగడంగిరి. తపశ్చర్యనుండి తల్లిచే నివారింపబడినందున నాబాలకు ఉమ *

* ఉ= ఓసి ; మా= వలదు.

యను పేరును వచ్చెను. దీపము దీప్తిగల జ్వాలచేవలెఁ, ద్రిదివ మార్గము మందాకినిచేఁ బోలె, శేముషీసంపన్నుఁడు సంస్కార వతియైన వాక్కుచే నెట్లో యట్లే హిమవంతుఁడు పార్వతిచేఁ బవిత్రీకరింపఁబడినవాఁడై భాసిల్లెను.

బాల్యమునఁ బార్వతి క్రీడారసాస్వాదన పరాయణ యుంబోలె సఖులంగూడి మందాకినీ సైకతస్థలముల వేదికల నిర్మించుచుఁ, గందుక కేళిం దేలుచు, విచిత్ర పాంచాలికా నికాయములతో దఱచుగా నాడుకొనుచు వినోదించుచుండెను. ఉపదేశకాలము రాఁగానే మేధావినియగు పార్వతికిఁ బూర్వ జన్మాభ్యస్తవిద్య లన్నియు స్వయముగానే లభ్యపడినవి. శర దాగమమున హంసలు గంగానదిం జేరుటయుఁ, జీఁకటి రాఁగానే వెలుతురుతీఁగలకు వెలుఁగు వచ్చుటయు సహజము గదా! అంతలోఁ బార్వతికి యౌవనము వచ్చెను. నవయౌవ నారంభమున నభివ్యంజిత పీన జఘనాద్యవయవవిశేషమగు పార్వతి శరీరము తూలికతో నున్మీలితమైన యాలేఖ్యము లీల, సూర్యాంశువులచే వికసితమైన యరవిందము చందమున శోభిల్లెను. చంద్రగతమై పద్మగుణములను, బద్మాశ్రితమై చంద్రశోభను బడయనోపక చపలమైయున్న లక్ష్మి యుమా ముఖముంజేరి తనబాల్యముం బాసెను. లేఁజిగురునఁ దెలి దమ్మియో, యచ్చపుంబవడమున ముత్తెపుంబూసయో

యుంచిన నవి యెట్లు విలసిల్లునో యాలీలఁ గెమ్మోవిపైఁ గ్రమ్మిన రుచులతో నబ్బాల శుచిస్మితము దర్శనీయమై యుండెను. అమృతధార లొలుకు కంఠముతో మధురభాషిణి యగు పార్వతి పలుకు పలుకుల నాలకించినవారికిఁ బరభృత స్వరములు సైతము విషమబద్ధ తంత్రీ నిస్వనములవలెఁ గర్ణ కఠోరము లనిపించును. విశాలనయన యగు శైలతనయ నీలోత్పల సదృశములగు చకితవిలోకితముల నాఁడు లేళ్లంజూచి గ్రహించెనా ? గాక, యవియే యాకలికినుండి గ్రహించెనా? యని సంశయింపఁదగి యుండెను. సమస్త సౌందర్యమును జతు రాననుఁ డొకచోటనే నిలిపి చూడఁ గోరికగలవాఁడై సక లోపమాద్రవ్యములను బూనికతో నాయాచోట్లనుంచి యీ యింపుఁబోణిని సృజించెనా యనునట్లు భువనమోహన లావణ్యముతో నాధరాధర కుమారి విరాజిల్లుచుండెను.

ఇట్లుండ నొకప్పుడు కామసంచారియగు నారద మునీ శ్వరుఁ డేతెంచి, తండ్రి సమీపమున నున్న యవివాహిత యగు పార్వతిం జూచి, "యీసుశీల సవతులులేనిదై ప్రణయ ప్రభావముననే హరశరీరార్ధమును హరింపఁగలదు," అని వచించి వెడలిపోయెను. అప్పటినుండియు హిమవంతుఁడు తనపుత్రిక సంప్రాప్తయౌవనయైనను హరునికంటె నన్యుఁడగు వేఱొకని కీయందలంపక యీశ్వరునికొఱకే వేచియుండెను.

మంత్రపూతమైన హవ్యము నెట్లగ్నిహోత్రుండు తప్ప మఱి యే యితర తేజఃపదార్థములును గ్రహింప సర్హములు కావో యట్లే పరమేశ్వరుఁడు తప్ప పార్వతిపాణి గ్రహించుట కన్యు లర్హులుకారుగదా! సదాశివుఁడు పార్వతిం దనకిచ్చి పరిణయ మొనర్పుమని యడుగనందున హిమవంతుఁడును శంకరుని స్వయముగా వేఁడలేదు. సాధువులు ప్రార్థనాభంగభయముచే నిష్టకార్యమునందు సైత ముదాసీనతను వహింతురుకదా!

జనకునెడ నూనిన కోపముచే యోగాగ్నిలో దాక్షా యణి గతజన్మమున నేనిమునమున దగ్ధమై శరీరము త్యజించెనో యదిమొదలు పశుపతి ముక్తసంగుఁడై యపరిగ్రహుఁడై యుం డెను. అట్లు కాలము గడపుచుండిన కృత్తివాసుఁడు నియతా త్ముఁడై తపమాచరింప సంసిద్ధుఁడై గంగాప్రవాహసంసిక్తము లైన దేవదారువులు కలదియు, మృగ మద సుగంధ బంధుర మైనదియుఁ గిన్నరుల సురుచిర సంగీతముచే సొంపైనదియు నగు హిమవన్నగ సానుప్రదేశముం జేరెను. ప్రమథగణ ములు పరమేశ్వరుననుసరించి యాశైలముంజేరి నమేరు ప్రసవ ముల నవతంసములుగా ధరించి, మృదువైన భూర్జవల్కలములం దాల్చి మనశ్శిలాధాతువిశేషముల నవలేపనములు గావించు కొని, శైలేయవ్యాప్తములైన శిలాతలములపై విహరింపఁదొడఁ గిరి. పరమశివుని వాహనమైన వృషభరాజము తుషారసంఘాత

శిలాసమూహములను ఖురాగ్రములచే విదారించుచు సింహగర్జనముల సరకుసేయక దర్పించి, గవయమృగములు బెదరి చూడ మధురధ్వనులతోఁ బెనుఅంకెలు వేయుచుండెను.

తపఃఫలములు తానే యిచ్చు అష్టమూర్తి యాప్రస్థమున దన మూర్త్యంతరమగు నగ్నిని బ్రతిష్ఠించి చిదుగులతోఁ బ్రజ్వరిల్లఁజేసి యేదియో కోరిక నర్థించి తపము గావించుచుండెను. అనర్ఘ్యమహిమాతిశయవిభ్రాజితుండును బృందారకార్చితుండును నగు పరమేశ్వరుని హిమవంతుం డొకనాఁడు దర్శించి యర్ఘ్యాదులతో నర్చించి తచ్ఛుశ్రూషార్థమై నియమవ్రతయగు తనపుత్త్రికను జయావిజయ లను చెలులతోఁ గూడి యటనుండ నియమించెను.

తనసమాధికిఁ బ్రత్యర్థిభూత యైనను దన్ను సేవించుచున్న యప్పార్వతిని గిరిశుఁడు నిషేధింపలేదు. స్త్రీసన్నిధానాది వికారహేతువు లున్నను జేతోవికారమునకు లోను గానివారేకదా ధీరులు! కుటిలకుంతలయగు నా కుధరకుమారి శివసపర్యాధుర్యయై యమ్మహానుభావుని పూజకై పుష్పములు కోసి తెచ్చియిచ్చుచు నిత్యకర్మానుష్ఠానమునకై కుశల నందిచ్చుచు నియమవేదికను శుభ్రపఱు

చుచు నప్రమత్తయై సేవించుచుండెను. హరుని శిరమున సుస్థిరుఁడైయున్న హిమకరుఁడు తన శీతలచంద్రికాజాలములం బఱపి పార్వతీదేవి పరిశ్రమము నివారించుచుండెను.

# గిరిజా కల్యాణము

## —: బ్రహ్మ సాక్షాత్కారము :—

—):o:(—

పరమేశ్వరునికిం బార్వతి శుశ్రూష యొనర్చు కాలమునఁ దారకాసురునిచే నిర్జితులైన నిర్జరులు పురందరుని ముందుంచుకొని సత్యలోకమున కేగిరి. ముకుళితారవిందములు గల సరోవరముల కుదయభానుఁడువలెఁ బరిమ్లాన ముఖములు గల వేల్పులకు బ్రహ్మ ప్రత్యక్షమయ్యెను. వాగీశుండును సర్వతోముఖుండును సర్వలోకస్రష్టయు నగు సురజ్యేష్ఠుని దర్శించి వారద్దేవునకు నమస్కరించి యవ్విరించి నర్థయుక్తములగు వాక్కుల నిట్లు ప్రస్తుతించిరి :—

క. దేవా! సృష్టికిఁ బూర్వము
కేవలుఁడవు; పిదప సృష్టికిం గడఁగి త్రిధా
భావము నొందితివి ప్రభూ!
నీవు గుణత్రయ విభాగ నియతిఁ ద్రిమూర్తీ!

గీ. నీట నీచేత నేవిత్తు నాటఁబడియె
రిత్తవోవని యాత్మోత్తవిత్తనమున
వెలువడిన యీచరాచరవిశ్వమునకుఁ
బ్రభవమని నీవు కొనియాడఁబడుదు వభవ!

గీ. కేవలుఁడవై యెసంగెదు దేవదేవ!
నిజమహిమ మూఁడవస్థల నెఱయఁజేసి
సృష్టిసంస్థితి విలయంబు లెనయఁజేయు
స్వామి! నీకిదె మానమస్కారశతము.

గీ. సృష్టి కావించు కోర్కెచే రెండుమూర్తు
లైన నీయాత్మభాగంబులే నిజంబు
స్త్రీపురుషు; లవ్వియే భూతసృష్టి పితలు
గా వచింతురు పెద్దలు దేవదేవ!

గీ. అభవ! నీకాలపరిణామ మనుసరించి
వ్యస్తమై యున్న నిద్రా రాత్రి-పవలు-గలవొ
తలఁప, నీ కెవి నిద్రయు మెలఁకువ యునౌ
యవియె భూతములకుఁ బ్రళయంబు-సృష్టి.

గీ. ఈ వకారణుఁడవు- నీవు జగద్యోని
వి - జగదాది - వాదివిరహితుఁడవు-
తగ నిరంతకుఁడవు - జగదంతకుండవు-
విశ్వనాథుఁడవు - నిరీశ్వరుఁడవు.

గీ. ఎఱుఁగుదువు నిన్ను నీచేతనే మహాత్మ!
యీవె నీచేతనే సృజియించుకొందు
వయ్య నీయందె నిను: గృతివైన నీవు
విలయ మగుదువు నీయందె విశ్వమూర్తి!

గీ. కఠినుఁడవు-ద్రవమూర్తివి కార్యకార
ణాత్మకుఁడవీవు-స్థూలసూక్ష్మాత్మకుఁడవు-
గురు లఘు విభేద మూర్తి వీ వరయ, నీకుఁ
గలదు ప్రాకామ్య మా విభూతుల విధాత!

గీ. ప్రణవ మే వాక్కులకు సమారంభమయ్యెఁ,
ద్రిస్వరము లుచ్చరణములై తేజరిల్లెఁ,
గర్మ యజ్ఞము-ఫలము స్వర్గంబు - నయ్యె,
ఆ వచస్సులు నీయందె యవతరించె.

గీ. ఎల్ల పురుషార్థములఁ బ్రవర్తిల్లునట్టి
ప్రకృతి వని చెప్పుదురు నిన్నుఁ బరమపురుష!
దాని సాక్షివయై యుదాసీనవృత్తిఁ
జూచు పురుషుండ వని నిన్ను శ్రుతులు వలుకు.

గీ. పితవు నీవ దేవ! పితృదేవతలకును,
వేల్పు వీవ యెల్లవేల్పులకును,
బరుల కంటె నీవు పరుఁడవు, స్రష్టవు
సృష్టికర్తలకు విశిష్టమూర్తి!

గీ. హవ్యమవు హోతవును నీవ! యన్న మీవ!
భోక్తవును వేద్యమును జ్ఞాతవును మహాత్మ
నీవ! పరమైన ధ్యేయంబ వీవ! ధ్యాత
వీవ! నీ కివె మా నమస్కృతులు స్వామి!

యథార్థములును హృదయంగమములును నగు సుపర్వ స్తోత్రముల నాలకించి యాభగవంతుఁడిట్లు వచించెను: "ప్రభూత పరాక్రమక్రమ విరాజితులగు విబుధులారా! మీమీ యధికారముల సముచితసామర్థ్యముల నిర్వహించు చుండియు నొకేకాలమున నీయెడ కేతెంచిన మీకెల్లరకును శుభమేకదా! నీహారాచ్ఛాదనమున మందీకృతములైన దీప్తులతో వెలుంగు నక్షత్రములలీల మీ ముఖములు తమతమ మునుపటి కాంతులఁ దాల్పవేమి? చిత్రప్రభాపుంజము వెలువరింపక శతమన్యుని శతకోటి మొక్కవోయిన యంచులతో వెలవెలం బోవుచున్నదేల? పరిపంథి దుర్వారమైన వరుణ పాశము గారుడమంత్ర ప్రభావమున విగతవీర్యమైన దర్వీకరము తెర్వున దైన్యము వహించినదేల? కుబేరుఁడు తనభుజస్తంభమున గదాదండము ధరింపమి శాఖవిఱిగిన సాలముపోలిక వాసిం బాసినాఁడు. శల్యమువలె నీతని హృదయమున నాటుకొనియున్న పరాభవమును ఈదీనస్థితి వ్యక్తము సేయుచున్నది.

తేజోవిహీనమగు దండముం దాల్చి కృతాంతుఁడు దానితో నేలగీఱు బేలతనము పొలగుట కేమి హేతువు? ఆతఁ డా దండమునకు ఆఱిపోయిన కొఱవికట్టియ లాఘవముంగూర్చినాఁడేమి? ఈ ద్వాదశాదిత్యులును ప్రతాపక్షతిచేఁ జల్లనివారై చిత్రన్యస్తుల వలె నాలోకనీయులై యుండుటకుం గతంబెయ్యది? జలములు వెనుకకుఁ దిరుటవలనఁ ప్రవాహనిరోధ మెట్లూహింపఁబడుచున్నదో యట్లే యీ నలుబదితొమ్మిది వాయువుల తడఁబాటుచేఁ దదీయవేగ భంగము సూచితమగుచున్నది. పరిభవదుఃఖముచే వినమ్రములైన జటాజూటముల ప్రేలాడుచున్న చంద్రరేఖలతో నేకాదశరుద్రుల శిరములు క్షతహుంకారములై దీనదశం బ్రకటించుచున్నవికదా! *ఉత్సర్గము ‡లపవాదములచే వలె లబ్ధప్రతిష్ఠులగు మీరు బలవత్తరులగు శాత్రవులచేఁ బ్రతిష్ఠాభంగము నొందితిరా? గీర్వాణాధిపులారా! మీరేమి వేఁడెదరు? లోకనిర్మాణము నాయందును లోకరక్ష మీయందును నెలకొనియున్నది. కావున మీ వాంఛితము నెఱిఁగింపుఁడు."

ఇట్లు వచించినంతనే వాసవుఁడు మందానిల కంపిత కమలాకరము కరణి శోభిల్లు తననేత్ర సహస్రముచే

---

* ఉత్సర్గములు = సామాన్య శాస్త్రములు ('మాహింస్యాత్'-వంటివి)

‡ అపవాదములు = విశేషశాస్త్రములు ('గా మాలభేత'- వంటివి)

'గురువరా! బ్రహ్మదేవుని ప్రశ్నలకుం బ్రత్యుత్తర మొసంగుఁ' డను నర్థము సూచించు నెన్నున బృహస్పతిం బ్రేరించెను. ఇంద్రుని వేయికన్నులకంటె నధికమగు ప్రభావముగల బుద్ధి వైభవముతో విరాజిలు బృహస్పతి ప్రాంజలియై జలజాసనునితో నిట్లు పలికెను :—

"ఓ భగవంతుఁడా! నీవు వచించినది వాస్తవమే. మా పదవిని బరిపంథులు హరించిరి. సర్వాంతర్యామి వగు నీ వెఱుంగని దేదికలదు? నీ వొసంగిన వరముల బలముచే గర్వించి తారకుఁడను మహాసురుఁడు ధూమకేతువువలె లోకములకు విప్లవహేతువై విజృంభించి యున్నాఁడు. ఈ తారకుని నగరిలోఁగల క్రీడాసరోవరముల యందలి కమలములు వికసించుటకే మాత్ర మెండ కావలసి యున్నదో యాపాటియే చండకరుఁడెండ కాయుచున్నాఁడు. శివుఁడు శిరోరత్నముగాఁగొన్న కళమాత్రము కైకొనక విడిచి పెట్టి, కడమకళ లన్నింటితోఁ దారాధిపుఁడు తారకాసురుని సేవించుచున్నాఁడు. తారకుని కేళీవనమున వీచినచోఁదనపైఁ గుసుమస్తేయమను నభియోగము మోపఁబడుసను భయమున వాయుదేవుఁడాతని యుద్యానవనమున వీచుట మాని, యా రక్కసులదొర యంతికముం జేరి తాళవృంత సంచారమున నెంత గాలి వచ్చు నంతయే వీచుచున్నాఁడు. ఋతువులెల్ల నొక

దాని వెంట నొకటి వచ్చుట మాని స్నానసంభార తత్పరములై తారకాసురు నుద్యాన పాలకులతోఁ దుల్యప్రతిపత్తి వహించి యా పూర్వగీర్వాణ సార్వభౌముని సేవించుచున్నవి. సాగరుఁడు తారకాసురునికి బహుమాన పురస్సరముగా సమర్పింపఁదగిన మణిగణములం దనగర్భమునఁ బరిపక్వమగు పర్యంతము జాగరూకుఁడై పరిరక్షించుచుండును. దేదీప్యమానమై తేజరిలు శిరోరత్నములుగల వాసుకిప్రముఖ భుజంగపుంగవులు అఱిపోవని దివిటీలం దాల్చిన దివిటీకాండ్రై తారకునిం గొల్చుచున్నారు. హరిహయుండు సైత మయ్యసురస్వామి యనుగ్రహ మపేక్షించి నాటి నాటికిం దన నందనవనమునుండి కల్పద్రుమ సంజాతములగు మంజులాభరణాదుల దూతలచేఁ బంపి యాతఁడు దన కనుకూలుఁడగుటకుఁ దగు యత్నము లొనరించుచున్నాఁడు.

"ఈ విధి దేవతాదు లెల్లరు వినయ విధేయులై యారాధించుచున్నను దారకుఁడు లోకముల బాధించుచునే యున్నాఁడు. దుర్జనులు ప్రత్యపకారముచేతనే శమింతురుగాని యుపకారములచే మంచివారగుదురా? అమరవధువులు సదయ హృదయలై తమ సుకుమార కరములతోనే నందనవన పాదపముల పల్లవములను గిల్లుదురో యా తరునికరముల నెల్లఁ దారకాసురుఁడు కరుణమాలి తెగనఱికించుచున్నాఁడు.

ఆ రక్కసునిచే బందిగావింపఁబడిన బృందారకసుందరు లాతఁడు నిద్రించుతఱిఁ జామరములంబూని నెమ్మదిగా వీచుచుఁ దమ దశావిపర్యాసముం దలంచుకొని కన్నీరు నించు చున్నారు. దివాకర తురంగమ తీవ్రఖురవిదారితంబులైన మేరుశృంగంబులం బెకలించుకొనిపోయి తారకాసురుం డాత్మా లయంబులఁ గ్రీడాశైలంబులుగా సంతరించుకొని వానిపై విహరించుచున్నాఁడు. మందాకినీ తోయంబు లిప్పుడు దిగ్వా రణదానధారలచే మలినీభూతములై యుండుటయే మిగిలినది కాని, తదీయ హేమాంబుజములన్నియుఁ దారకాసురుని ప్రమదావన దీర్ఘికలకుం గొంపోవబడినవి. ఆరక్కసుని తాఁకుడు వలని వెఱపుచే విమాన మార్గము పాడుపెట్టఁబడినది. దేవతల లోకాలోకనప్రీతి నశించినది. అధ్వరములందు వ్రేల్వఁబడిన హవ్యములను మాయావి యగు నా దైతేయవిభుండు మా నోటినుండి యొడిసి తీసికొని పోవుచున్నాఁడు. చిరకాలార్జితమైన దేవేంద్రుని కీర్తి యాతని వాహన రూపమున మూర్తీభవించి నదా యేమి? అని చెప్పనొప్పిన యుచ్చైశ్రవమును దారకుఁడు హరించినాఁడు.

"క్రూరుఁడగు నద్దనుజునిపై మేము ప్రయోగించిన సర్వోపాయములును సన్నిపాత పీడితుఁడగు రోగి యెడ వీర్యవంతములైన యౌషధములవలె నిష్ప్రయోజనములై

నవి. దేనియందు మాకు జయాశ నెలకొనియుండెనో యాహరిచక్రము తారకున కురోభూషణ మాయెను. ఆదాన వుని దంతావళములు బలారాతి యైరావతము నోడించి యిపుడు పుష్కలావర్తకాది మేఘములయందు వప్రక్రీడ నభ్యసించు చున్నవి; కావున నోస్వామీ! ముముక్షువులు కర్మబంధవిచ్ఛే దకమగు ధర్మము నెట్లుకోరుదురో యట్లే తారకాసుర విధ్వం సన విశారదుఁడగు చమూపతిని సృజింప వలయునని మిమ్ము మేమర్థించుచున్నాము. సురసైన్య రక్షకుఁడగు నే సేనాని మున్నిడుకొని గోత్రారి శాత్రవాపహృతయైన విజయలక్ష్మిని మరలఁ దెచ్చునో యట్టి సేనాపతిం బుట్టింపవలయునని గట్టిగా మిమ్ము వేడుచున్నారము.''

ఇట్లు దేవగురువు వచించినంతనే, గర్జానంతరము కురియు వర్షమువలె హాయిం గూర్చు వాగ్విలాసముతో వాగ్వల్లభుం డమరులతో, ''మీ యీకోరిక సిద్ధించును. దానికై కొంత కాలము మీరు వేచియుండవలయును. తారకుని వృద్ధికి నేనే కారణభూతుఁడను. ఆయసురుని నేనే పెంచి నేనే నాశన మొనర్చుట విహితముకాదు. విషవృక్షమునైనను దాను బెంపొందించి తానే విచ్ఛేదన మొనర్చుట పాడికాదు. పదు నాల్గు భువనములను బూదియొనర్పఁగలిగిన యాతని తపమును వరదానముచే నేనే శమింపఁజేసితిని. నీలలోహిత వీర్యాంశ

సంభవుఁడుగాక మఱి యెవ్వఁడేనియు సమరకళా కుశలుఁడగు నా నక్తంచర శేఖరుని జయింపఁజాలఁడు. పరమేశ్వరుఁడు తమోగుణాతీతుఁడు ; ఆపరంజ్యోతి ప్రభావ విశేషమును నేనును విష్ణుమూర్తియు గ్రహింపఁజాలక పోయితిమి. ఇనుము సూదంటురాయిచేవలె, నిశ్చల సమాధి నిల్చియున్న శంకరుని మనస్సు ఉమా సౌందర్యముచే నాకర్షింపఁబడునట్లు మీరు చేయవలెను. ఉమా శంకరులకు జన్మింపఁగల కుమారుఁడు మీకు సేనాపతియై తన వీర్యవిభూతిచే మీ శాత్రవుని చంపును ; తారకునిచే బందిగావింపఁబడిన వేల్పుఁజెలనాగలను విడిపించి వారి చేతి పాశములను విప్పుటకు మీరు సమర్థులగుదురు,'' అని పలికి తిరోహితుఁడు కాఁగా, దేవతలు తమ కర్తవ్యమును మనములం దిడుకొని స్వర్గమున కేగిరి.

అంతటఁ బురందరుఁడు స్వారచిత్తమును గౌరియెడ నిలుపుటకుఁ గందర్పుఁడే ముఖ్యసాధనమని నిశ్చయించి, కార్యసిద్ధియందుత్సుకతయుఁ ద్వరయుం బూని యుమాపతి విలుకానిం దలంచుకొనియెను. తలంచుకొనుటయే తడవుగా సహచరుఁడగు వసంతుఁడు చూతాంకురాస్త్రములం దాల్చి వెంటనడువ సుందరసుదతీ భ్రూలతలవలె రమణీయమైన శృంగములచే

రంగారు చాపమును రతీకంకణ పదాంక సంకలితమగు త
కంఠమునం దగిలించుకొని పుష్పధన్వుఁడు శతమఖుని ప్రో
ద్బాంజలియై ప్రత్యక్షమయ్యెను.

———

# గిరిజా కల్యాణము

## —: కామ దహనము :—

—(౦)—

అలరువిలుతుఁ డరుదెంచుటతోడనే దేవత లరిగిన వైపునుండి చూడ్కుల మరల్చి గీర్వాణ వల్లభుఁడు తన వేయికన్నులం గందర్పునిపైఁ బ్రసరింపఁజేసెను. ప్రభువుల కాశ్రితుల యెడ గౌరవము హెచ్చుటయుం దగ్గుటయుఁ బ్రయోజనాపేక్షం బట్టియే కదా !

పాకశాసనుఁడు పంచశరునకుం దన యాసనమునకు సమీపముననే యర్ధాస్థానము నొసంగెను. ఏలిక తనయెడఁ గనంబఱచిన ప్రసాదము నాత్మోత్తమాంగముచే సంభావించి కందర్పుఁడు విస్రంభముగా విబుధ విభునితో నిట్లు విన్నవింపఁ దొడఁగెను. "మహానుభావా! నీకై నావలనఁ గావింపఁ దగిన దెద్దికలదో దాని నాజ్ఞాపింపుము ; నీవు నన్ను స్మరించుటయే నాభాగ్య విశేషము. ఆ నాభాగధేయమును నీయాజ్ఞచే వర్ధిల్లఁజేయుము. నాకలోకాధిపత్యము నర్థించి యెవ్వఁడేని ఘోరతపమాచరించు చున్నాఁడా యేమి? దానం జేసి నీ

యసూయ కాతఁడు పాత్రుఁడాయెనా? చెప్పుము. వాని నిపుడే సంహిత సాయకమైన నా యీ కార్ముకముచే నిర్మూలించెద. ఎవ్వఁడేని పునర్భవక్లేశభయమున ముక్తిమార్గము నవలంబించినాఁడా యేమి? ఆతఁడెవ్వఁడో యెఱింగింపుము. భువనమోహినులగు సుందరీమతల్లుల కటాక్షమాలికలచే నవ్వాని నిపుడే బద్ధునిం గావించి చిరకాల మాస్థితిలోనే నిలిపెద. నీవైరి శుక్రనీతి పారంగతుఁడైనను సరియే. వచింపుము, ఆతనియందు విషయాభిలాష నెలకొల్పెదను. ప్రవాహ మేరీతిగా నదీకూలముల నశింపఁజేయునో యట్లే రాగము వర్ధిల్లి యాతని ధర్మార్థములను ధ్వంస మొనర్పఁగలదు. వ్రతదుఃఖశీలయగు పతివ్రత నెవ్వతెనేని మోహించితివా, ఎవతె సౌందర్యము నీచిత్తము నాకర్షించినది? ఆమె యెవ్వతెయో వక్కాణింపుము. క్షణములో లజ్జనుజ్జగించి యా నితంబినీమణి నీకు వశవర్తినియై స్వయముగా నిన్నాశ్లేషించున ట్లొనర్చెదను. నీ శాత్రవులెవరో, శూరశిఖామణీ! వచింపుము. నీ వజ్రాయుధమునకుం గొంత విశ్రాంతి నొసంగుము. నీకప్రియ మాచరించిన సురవైరిని నా శరములచే విఫలీకృత భుజవీర్యునిగా నొనర్తును. వాఁడు నీకే కాదు భయపడుట, కోపస్ఫురితాధరలగు కువలయాక్షులకు సైతము భీతిల్లు నట్లొనరింతును. కుసుమాయుధుఁడనయ్యు నీ యనుగ్రహ

బలముచే దుర్వారుఁడనై, యొక్క వసంతుని మాత్రమే సహాయునిగాఁ గొని పినాకపాణి యగు హరుని సయితము విగతధైర్యునిగాఁ జేయ వలంతిని. ఇఁక నాప్రోల నన్య ధనుర్ధరులపాటు చెప్పవలయునా ?''

వలరా జిట్లు పలికినంతనే వేలుపుదొర తొడపై నిడుకొనిన తనకాలు డించి పాద పీఠమున నుంచుకొని, సంకల్పితార్థముంగూర్చి సంతసముతో నాత్మసామర్థ్యముం బ్రకటించిన మకరధ్వజునితో, ''సఖుఁడా ! యీ సర్వమును నీయందుపపన్నమే. కులిశమును నీవును నాకు రెండస్త్రములు ; తపోవీర్యధుర్యులగు వారిపై నావజ్రాయుధము పనిచేయఁజాలదు. నీవుమాత్ర మందఱపైఁ బ్రయోగింపఁదగిన దివ్యాస్త్రమవు సుమా! నీబలము నే నెఱుంగనిది కాదు. నాతోఁ దుల్యుఁడవగు నిన్నిప్పు డొక గొప్పకార్యమున నియమించెదను. భువనభారమును వహింపఁగలవాఁడని యెఱింగియే కదా యాదిశేషుని శ్రీవిష్ణుమూర్తి తనకుందగిన పానువుగా నియోగించినాఁడు. వృషాంకునిపై సైతము బాణము వేయఁజాలుదు నని చెప్పిన నీచే మాకార్య మంగీకరింపఁబడినట్లే యజ్ఞహవిర్భాగ భోజనభాజనులును ప్రబల శాత్రవ సంతత సంపీడితులును నగు దేవతలకుం దమ యీప్సితములు సిద్ధింపవలయునన్న హరునిపై నీవు నీ యాయుధములఁ బ్రయో

గించుటతక్క వేఱు మార్గము లేదు. తమ శాత్రవుని జయించుట కమృతాంధసులు హరవీర్యసంభవుఁడగు సేనాపతి వలయునని వాంఛించుచున్నారు. పరమశివుం డిపుడు తన తత్త్వమున నాత్మ ననుసంధాన మొనర్చి మంత్రన్యాసపూర్వకమైన నిష్ఠయం దున్నాఁడు; అట్టి బ్రహ్మానుసంధాననిష్ఠానిధి నీబాణనిపాతమునకు సాధ్యుఁడగునుగాని యొరులకు సాధ్యుఁడగునా? నియతచిత్తుఁడగు నా శివునికిఁ బరమ పవిత్రయగు హిమాద్రినందిని ప్రియురాలగునట్లు ప్రయత్నింపుము. పరమేశ్వరుని భార్యయగుటకుఁ బార్వతియే తగినదని పరమేష్ఠి పలికినాఁడు. నగేంద్రకన్యయుఁ దండ్రిచే నియోగింపఁబడినదై హిమగిరి యూర్ధ్వమునం దప మొనర్చు స్థాణు నుపాసించుచున్నది. ఈవిషయము నాకు నావేగులయిన యప్సరసలు చెప్పఁగాఁ దెలిసినది. కావునఁ జెలికాఁడా! కార్యసంసిద్ధికై కడంగుము. దేవకార్యమును సాధింపుము. పార్వతీ సాన్నిధ్యముచేత సాధ్యమైనదే యయినను ఈ కార్యమునకు నీవునుం దోడుపడవలసియున్నది. విత్తనముచేతనే యంకురోత్పత్తి కావలసియున్నను దోయ మవశ్యము పోయవలయును గదా! దేవతల విజయమున కుపాయభూతుఁడైన భూతేశునిపైఁ బ్రసవబాణప్రయోగము చేయు భాగ్యము నీకే లభించెనేని నీవు కృతార్థుఁడవు. ఒక కార్యము స్వభావసిద్ధ

ముగా నప్రసిద్ధమే యయినను అది యనన్యసాధారణమగు నేని కర్తకుఁ గీర్తిఁదెచ్చునుగదా ? నిన్నభ్యర్థించువారు గీర్వాణులు. కార్యమా త్రివిష్టప రక్షణార్థ మొనర్చునది. అది నీ చాపముచే సాధింపనలవి యగునది. దాని స్వభావము పరిశీలించి చూతుమా యది ఘాతుకమైనది కానేరదు. మదనా! నీవు నిజముగా నాశ్చర్యవిక్రముఁడవు. నీకు వసంతుఁడు సహచరుఁడు. నీకు సహాయపడుమని యాతనిఁ బ్రత్యేకముగా నొకరు ప్రేరింప నవసరము లేదు. జగత్ప్రాణుని జాతవేదునికి సాయపడుమనియుఁ, బ్రేరింపవలెనియు నొక్కఁడు వక్కాణింపవలయునా !'' యని పలికెను.

అంతటఁ గంతుఁడు స్వామియాజ్ఞను భగవత్ప్రసాదదత్తమైన మాలంబోలె నౌదలం దాల్చి సురాధిపుని సెలవుగైకొని లేవఁగా, నైరావతాస్ఫాలన కర్కశములైన తనహస్తములతో దేవవిభుండు రతిపతి శరీరమును బ్రణయపూర్వకముగా స్పృశించి సాగనంపెను.

మదనుఁడు మాధవునితోడను రతితోడను బయలుదేరి శంకావిలచిత్తముతోఁ బ్రయాణము సాగించి యెటులో గుండె రాయిచేసికొని 'నాశరీరము నశించినను నశించును గాక కార్యము సాధించెద' నను దృఢనిశ్చయముతోఁ బరమేశ్వరు నాశ్రమముం జేరెను.

మునీశుల తపోవిధులకుం బ్రతికూలముగా వర్తించు వసంతుఁడా వామదేవు నాశ్రమసీమఁ దన సకలధర్మములఁ బ్రతిష్ఠించెను. వసంతకాలస్వరూపము మీనకేతనుని గర్వము నకు హేతుభూతముగదా! సహస్రకరుఁడు సమయవ్యతిక్రమ మూచరించి కుబేరగుప్తదిశం గూర్చిపోవ గమకింప, దక్షిణాశ తనముఖమున వ్యలీక నిశ్వాసముం బోలిన గంధవహుం బ్రవర్తిల్లఁజేసెను. సురుచిరనాదములతో నొప్పు సుందరుల పాదతాడనముల నపేక్షింపకయే యశోకము తటాలున బోదె మొదలుకొని చిగిర్చి పుష్పించెను. మంజులపక్షశోభితంబగు నవపల్లవాంకురము పరిపూర్ణతం గాంచుటతోడనే వసంతుఁడు దానిపై మదన నామాక్షరము లనందగిన భ్రమరముల నుంచెను. కర్ణికారము వర్ణోత్కర్షముకలదైనను నిర్గంధమగు టచే మనసు నొప్పించెను. ప్రాయికముగా బ్రహ్మదేవుఁడు ప్రతివస్తువునకును ఏదోకొంత వైకల్యముంగూర్చి తద్గుణ సాకల్యమునకు భంగము గలుగఁజేయుచుండునుగదా! వసంత లక్ష్మి విలగ్నభ్రమర కజ్జల రచనా విచిత్రమగు తిలకమును దన ముఖమునఁ బ్రకాశింపఁజేసి బాలారుణ కోమల రాగముతోఁ జూత ప్రవాళోష్ఠము నలంకరించుకొనెను. ప్రియాళు మంజరుల నుండి రేఁగిన రజఃకణములు కన్నులంబడి యవి దృష్టిప్రసార మునకు విఘ్నమాపాదించినను మదోద్ధతములగు మృగములు

మర్మర శబ్దములతో రాలు జీర్ణపర్ణములుగల వనస్థలులననిలాభి ముఖముగా సంచరించినవి. చూతాంకురాస్వాద కషాయకంఠ మైన పుంస్కోకిలము మధురముగాఁగూసెను. ఆ కూజితమే మనస్వినీ మాన విఘాత సమర్థకమైన మదనవచన మాయెను. కుంకుమలేపము మానుటచే నించుక పాండురవర్ణము లగు వదనములు గలవారును, శీతభయము వాసి *మధూచ్ఛిష్టము వర్జించిన విశదాధరోష్ఠములు గలవారును నగు కింపురుషాంగన లకు ఘర్మోదయ మాటచే వారి పత్రరచనా విశేషములు చెమ్మగిలఁ జొచ్చినవి.

అకాలసంభవమగు మధుమాస సంరంభముం దిలకించి నీలలోహితుని వనమున వసించు తపస్వులు వికారములకు లోనైరి, కాని వారాచిత్తవికృతిని బ్రియత్నముచే నిరోధించి స్థైర్యము నార్జించిరి. ఆరోపితపుష్పచాపుఁడై రతీద్వితీయుఁడై పంచశరుఁడు పరమేశ్వరు నాశ్రమమునకు రాఁగానే మిధున ములు స్నేహ రసోత్కర్షము వహించిన శృంగారభావమును వ్యక్తముగావించినవి. ఇందిందిరము కుసుమైకపాత్రము నందలి మకరందమును దనప్రియ ననువర్తించి పానముచేసెను. నిమీలి తాక్షియగు నాఁడులేడిని కృష్ణసారము తనశృంగముతో

* హేమంతమున స్త్రీలు బింబోష్ఠములు పగుల కుండుటకై మధూచ్ఛిష్టమును లేపనమొనర్చుకొనుట ప్రసిద్ధము.

గో(కెను. పంకజరేణు గంధబంధురమగు జలము పుక్కిలించి రాగభరముచే( గరేణువు మగయేనుగు నోటం బోసెను. తాను సగము గ్రసించిన బిసకాండమును జక్రవాకము పెంటి నోటి కందించెను. స్వేదబిందువులచే నించుక సముచ్ఛ్వసితము లైన మకరికాపత్త్రరేఖలు కలదియై, ప్రసవాసవాఘూర్ణిత నేత్రపంకజములతో శోభిల్లు తన ప్రియురాలి మోముచందురుని గిన్నరుడు ముద్దాడెను. సమగ్రపుష్పస్తబకము లురోజములై యొప్పార, రుచిరప్రవాళము లధరములై విలసిల్ల హృదయానందకరముగ( దేజరిల్లు లతావధూటులను దరువులు వినమ్రశాఖలనెడి తమ బాహువులతో( గౌ(గిలించినవి.

అట్టి యీ వసంతావిర్భావ సమయమున హరుడు దివ్యాంగనాగానము నాకర్ణించియు( బరబ్రహ్మానుసంధాన నిష్ఠకు దూరుడు కాడాయెను. ఇంద్రియనిగ్రహము గల వారియెడ విఘ్నములు సమాధిభంజన సమర్థములు కావుగదా! వామప్రకోష్ఠమున హేమవేత్రముందాల్చి ముఖమండలమున నొక యంగుళిని నిలిపి సంజ్ఞయొనర్చుచు( "ప్రమధగణము లారా! రచ్చచేయకుడు" అను నర్థమును సూచించుచు నందికేశ్వరుడు నీలకంఠుని నిలయమైన లతానికేతనము వాకిట నిలువంబడియుండెను. తచ్ఛాసన ప్రభావమున( గాననమంతయు నిష్కంప వృక్షమయ్యెను: నిభృతద్విరేఫమయ్యెను: నిశ్శబ్దాం

ఆంధ్ర భాషానిలయము
హైదరాబాద్

డజ మయ్యెను: శాంత మృగప్రచారమయ్యెను. వేయేల! ఆయరణ్యము చిత్రలిఖిత వ్యాపారము కలదియుంబోలె వెలయుచుండెను. ప్రయాణోన్ముఖులైనవారు పురోగతుఁడగు శుక్రునెట్లు వర్జింతురో యట్లే కాముఁడు నందీశ్వరుని కగపడకుండఁ దొలంగి చని, నమేరుశాఖాసంసక్త పార్శ్వదేశములుగల భూతపతి సమాధిస్థానముం జొచ్చి, యాసన్నమృత్యు వై త్ర్యంబకుంగాంచెను. అపుడు త్రినేత్రుఁడు దేవదారు ద్రుమవేదిపై శార్దూలాజినము మీఁద సమాధినిష్ఠుఁడైయుండెను. పర్యంకబంధమున నిశ్చలమైన పూర్వకాయముతో గుదింపఁబడిన తిన్నని యాయతాంసములతో, వికచరాజీవమువలె నంకమధ్యమున నుంపఁబడిన పాణియుగళముతోఁ బరమశివుఁడు ప్రకాశించుచుండెను. ఆమహనీయుని జటాకలాపము భుజంగమబద్ధమైయుండెను: అక్షమాల రెండుపేటలుగాఁ గర్ణావసక్తమైయుండెను. కంఠప్రభాసంపర్కముచే నతినీలమైన ముడితోడి కృష్ణాజినము నాతఁడు ధరించియుండెను. అచలితపక్ష్మమాలికతో, నిశ్చలోగ్ర కనీనికలతో, నధోముఖ మయూఖములతోఁ గించిత్ప్రకాశవంతములై, భ్రూవిక్షేప ప్రసంగ విరహితములై తనరు తననేత్రములను స్థాణుఁడు నాసాగ్రమున నిలిపియుండెను.

లోన సంచరించు ప్రాణాది వాయువులను నిరోధించినవాఁడై, వర్షసంరంభములేని యంబువాహమువలె, నభంగా

డంబరమైన హ్రదంబువలె, నిర్వాత ప్రదేశంబున నిష్కంపిత భంగి వెలుంగు దీపంబుపోలిక నీశానుఁడు సమాధిలోనుండెను. ఆదేవదేవుని బ్రహ్మకరోటి నేత్రవివరమునుండి దారిఁగల్పించుకొని యుద్భూతములైన తేజోఽఙ్కురములు మృణాళ సూత్రమునకన్న మృదుతరమైన బాలచంద్రుని శోభను జెడఁగొట్టుచుండెను. నవద్వారమార్గమున మనస్సును సంచరింపనీయక సమాధిచే వశపఱుచుకొని క్షేత్రవిదులు హృదయాలయమున నెవ్వనిఁబ్రతిష్ఠించి యక్షరునిగా నెఱుంగుదురో యా పరమాత్మను దనయందే పరమేశ్వరుఁ డవలోకించుచుండెను.

ఇట్టి స్థితిలోనున్నవానిని, మనసుచే సైత మెదిరింప రాని విషమనేత్రుని గుసుమాస్త్రుఁడు సమీపమునకే పోయి చూచి భయపడినవాఁడాయెను: విశ్లథపాణియయ్యెను. దనహస్తము నుండి పడిపోయిన శరచాపములను సైతము కనుఁగొనఁడయ్యెను.

అప్పుడు నష్టప్రాయమైన మదనబలమును దన సౌందర్యముచేఁ బునరుజ్జీవింప వచ్చినదో యనఁ బార్వతి సఖులైన యిర్వురు వనదేవతలు వెంటనడువ నచ్చోటి కేగుదెంచెను. పద్మరాగములఁదిరస్కరించు నశోకపుష్పములను, హేమద్యుతిని విడంబించు కర్ణికారములను, ముక్తాకలాపములుగాఁజేయఁబడిన సిందువారములను భూషణములుగా ధరించిన నగరాజతనూజ

యందము నయనానందకరముగా నుండెను. తరుణార్క రాగ
రమ్యమైన వసనముందాల్చి, స్తనభారమునఁ గించిదావర్జిత
యుంబోలెఁ జెలంగుచుఁ బర్యాప్తసుమ గుచ్ఛావనమ్ర కిసల
యవతి యగు లతలీల సంచరించుచు నమ్మించుఁబోణి రాణిం
చెను. కమ్మందనమ్మును నద్దెసలంజిమ్ము తన యూర్పుమొత్త
ములపై నాసఁగొని సమీపమ్మునకు వచ్చినదియు, బింబంబు
డంబు నపహసించు తన కెమ్మోవిపై వ్రాలం గమకించునదియు
నగు భృంగంబును సంభ్రమ లోలదృష్టియై యనుక్షణమును
లీలారవిందముతో నివారించుచుఁ గొండరాచూలి శూలపాణి
సమాధిస్థానముం జేరెను.

అనవద్యమైన యంగవిన్యాసముచే రతీదేవికి సైతము
లజ్జఁగూర్చు లావణ్యముతోఁ బిసాళించు పార్వతింజూచి పుష్ప
చాపుఁడు జితేంద్రియుఁడగు శూలహస్తుని నిర్జించి స్వకార్యసిద్ధి
సమకూర్చుకొనఁ దలంచి మఱియొకతూరి యోచించెను.
ఉమాదేవియు శంకరుని ప్రతీహారభూమి కేతెంచెను. పర
మేశ్వరుఁడును బరమాత్మనామక పరంజ్యోతిని దనలో
సాక్షాత్కరించుకొని ధ్యానము నిలిపి దృఢమైన తన పర్యంక
బంధమును విడిచిపెట్టెను: ప్రాఙ్నిరుద్ధ ప్రాణవాయువులను
బునస్సంచార యోగ్యములుగా నొనర్చెను. ఆ కారణమున
భువనత్రయ దుర్భరభార భరణ నిపుణుండగు నాదిశేషుఁడు

సైతము భూమి భాగమును ఫణాగ్రములపై నతిప్రయత్నమున వహింపసాగెను. నందీశ్వరుఁడపుడు మహేశ్వరునకు నమస్కరించి పర్వతరాజ కుమారి శుశ్రూషా పరతంత్రయై వచ్చియున్నదని విన్నవించెను. భగవానుఁడు నగనందనం బ్రవేశ పెట్టుమని భ్రూసంజ్ఞామాత్రముచే నాజ్ఞాపింపఁగా నందీశ్వరుఁడా కన్యను లోనికిరావించెను. ఆమెసఖులు తాము కోసిన కిసలయశకలములను వసంతపుష్పప్రకరములను జంద్రశేఖరుని చరణారవిందముల చెంగట నమస్కారములతో సమర్పించిరి. శ్రవోవతంసమగు పల్లవము క్రిందఁబడ నీలాలక మాలిక నడుమ నిగారించు నవకర్ణికారము జాఱ నుమాదేవియు వృషభ ధ్వజునికిఁ బ్రణామ మాచరించెను. ఇట్లు పార్వతి నమస్కరింపఁ భవుండు " ఏకపత్నీవ్రతుండగు ప్రాణేశ్వరునింబడయు " మ యాశీర్వదించెను. ఇదిసత్యమేకదా ! మహాపురుషోక్తులెన్నటికిఁ వ్యర్థముకానేరవు. మన్మథుఁడపుడు బాణప్రయోగ సమయ మిదియేయనితలంచి, పార్వతి శివునిసాన్నిధ్యమందుండుట హరునిపై లక్ష్యముంచి వహ్నిముఖమున దుముకం గమకించు పతంగముచందమునఁ దనశరాసనము ననేక పర్యాయము పరామర్శించెను. అంతఁబార్వతి తామ్రరుచిపుంజరమ యములైన కరములతో రవిమయూఖవిశోషితమై మెఱయు మందాకినీపద్మబీజమాలిక నుపాయనముగాఁ బరమ తపస

సైతము భూమి భాగమును ఫణాగ్రములపై నతిప్రయత్నమున వహింపసాగెను. నందీశ్వరుఁడపుడు మహేశ్వరునకు నమస్కరించి పర్వతరాజ కుమారి శుశ్రూషా పరతంత్రయై వచ్చియున్నదని విన్నవించెను. భగవానుఁడు నగనందనం బ్రవేశపెట్టుమని భ్రూసంజ్ఞామాత్రముచే నాజ్ఞాపింపఁగా నందీశ్వరుఁడాకన్యను లోనికిరావించెను. ఆ మెసఖులు తాము కోసిన కిసలయశకలములను వసంతపుష్పప్రకరములను జంద్రశేఖరుని చరణారవిందముల చెంగట నమస్కారములతో సమర్పించిరి. శ్రవోవతంసమగు పల్లవము క్రిందఁబడ నీలాలక మాలికల నడుమ నిగారించు నవకర్ణికారము జాఱ నుమాదేవియు వృషభధ్వజునికిఁ బ్రణామ మాచరించెను. ఇట్లు పార్వతి నమస్కరింప భవుండు " ఏకపత్నీవ్రతుండగు ప్రాణేశ్వరునింబడయు " మని యాశీర్వదించెను. ఇదిసత్యమేకదా ! మహాపురుషోక్తులెన్నటికిఁ వ్యర్థముకానేరవు. మన్మథుఁడపుడు బాణప్రయోగ సమయమిదియేయనితలంచి, పార్వతి శివునిసాన్నిధ్యమందుండుటఁ హరునిపై లక్ష్యముంచి వహ్నిముఖమున దుముకం గమకించు పతంగముచందమునఁ దనశరాసనము ననేక పర్యాయములు పరామర్శించెను. అంతఁబార్వతి తామ్రరుచిపుంజరమణీయములైన కరములతో రవిమయూఖవిశోషితమై మెఱయు మందాకినీపద్మబీజమాలిక నుపాయనముగాఁ బరమ తపస్వి

భయంకరజ్వాలలతో నుద్భవించి పైకెగసెను. "ప్రభూ! క్రోధము నుపసంహరింపుము. ఉపసంహరింపుము," అని దేవసంఘములు వియన్మార్గమునుండి యేకగ్రీవముగాఁ బలికిరి. అపుడే భవుని లలాటనేత్రమునుండి ప్రభవించిన యగ్ని మదనుని భస్మీభూతుం గావించినది. తత్క్షణమే రతీదేవి మూర్ఛిల్లినది. ఆ మూర్ఛలో మాత్రమా నెలంత భర్తృవ్యసన మనుభవింపలేదు. తీవ్రాభిషంగ ప్రభవమై యింద్రియ వ్యాపారముల స్తంభింపఁజేయ సమర్థమైన యా మూర్ఛవలన రతీదేవి కా ముహూర్తకాల ముపకారకమే యయ్యెను. తన తపస్సున కంతరాయము కల్పించిన కంతుని ఖండపరశుఁడు వనస్పతిని వజ్రమువోలెఁ గాల్చివైచి కాంతాసన్నిధానము పరివర్జింపఁదగిన దని నిశ్చయించి భూతగణములతోఁ దిరోహితుఁ డయ్యెను. శైలాత్మజయు మహోదార మనోరథుఁడైన తనతండ్రి యభిలాషము రిత్తవోవఁ దన శరీర సౌందర్యము వ్యర్థభావము నొందఁ, దన సఖుల మ్రోల నిట్టి విపర్యాసము జరిగినందులకు లజ్జించి నిరుత్సాహ యయ్యెను. రుద్రసంరంభమువలన బెగ్గడిల్లి ముకుళితాక్షియై యనుకంపార్హయై యున్న కుమారి నెత్తుకొని హిమవంతుఁడు వడిగా నిల్లు చేరెను.

# గిరిజా కల్యాణము

## —: రతి విలాపము :—

—(o)—

అట్లు మూర్ఛిల్లి నిశ్చేష్ట యయిన రతీదేవిని దుర్భర వేదనా ప్రతిపాదకమైన నూతన వైధవ్యము ననుభవింపఁ జేయుటకు హతవిధి తెప్పిఱిల్లఁ జేసెను. మూర్ఛావసానమున నా యన్నుమిన్న కన్నులం దెఱచి యవధాన పరత్వమున నల్దిక్కులం జూచెను. ప్రియుఁడు నశించెనన్న పరిజ్ఞానమే లేని యాచాన దృష్టి కిష్టవస్తుప్రాప్తి కలుగ లేదు. "జీవితేశ్వరా! ప్రాణములతో నున్నావా!" అని సకరుణముగాఁ బలికి లేచి చూచునప్పటి కా రమణి కన్నెదుటఁ బురుషాకృతి నున్న హర కోపానలభస్మ మొక్కటి దృగ్గోచరము కాఁగా విహ్వలయై రతీదేవి నేల నాలింగనము గావించుకొనినకతమున ధూళి ధూసరితమై వన్నెఁ దొఱంగిన వక్షోమండలముతో, వికీర్ణకుంతలయై వనలక్ష్మిని సైతము సమదుఃఖ నొనర్చుచున్నదో యన నతిదీనముగా నీతీరునఁ బలవించెను :—

"నీ సుకుమార శరీర మిట్టి ఘోర పరిణామముం గాంచుటఁ దిలకించియు నేను నాశనమై పోవకున్నాను. ఔరా!

స్త్రీ లెంత కఠినలు! మనోనాయకా! నీ వెన్నండును నా కనిష్ట మాచరించిన వాఁడవు కావు. నేను నీయెడ నపరాధ మెద్దియుం గావించియుండను. నీ దర్శనము నొసంగక నిర్నిమిత్తముగా నన్నేల యాక్రందింపఁ జేయుచున్నావు? నీ యధీనముగదా నా జీవితము అట్టి నన్నుం బాసి క్షణములో నదృశ్యుఁడ వైతి వేల? సౌహార్దమును భగ్న మొనర్చి నన్నిట్లు భంగ పఱచుట నీకుఁ దగవా? నిను వీడి నేను మనఁగలనా? సేతువు తెగిపోవుటవలన నీరెల్లఁ గోలుపోయిన కాసార మున జలైకాయత్తజీవిత యగు పద్మిని జీవింపఁగలదా? 'నేను నీ హృదయమున నిరంతరము నివసించుచున్నాను' అని నీవు పలికిన ప్రియభాషణము కైతవము గాక సత్యమగునా? అది నీ యౌపచారిక సూక్తి యని తలంతును. కానిచో నీ వనం గుఁడ వైన యనంతరముసైతము నే నక్షతశరీర నై జీవించి యుంటి నేల? పరలోకమున కేగిన ని న్నిపుడే యనుగమించి నా యార్తి నంత మొందించెదను.

" నా కేమి కొదవ. లోకమే విధివంచిత మైనది. జగమునఁ గల సర్వజీవుల యొక్కయు సౌఖ్యము నీ యధీనము గదా! ప్రియబంధుఁడ వైన నీ శరీరము కథావశిష్టమైన విషయ మెఱింగి నిశాకరుఁడు నిష్ఫలోదయుఁ డైనాఁడు. హరి తారుణ చారుబంధనంబును, మధుర పుంస్కోకిల శబ్ద సూచి

తంబును నగు నూతన చూతప్రసవ మింకెవ్వరికి బాణము కాఁగలదు? నీవిల్లునకుఁ దటచుగా నల్లెత్రాడగు గండుఁ దుమ్మెదల బారు విన్నఁబాటు వహించిన పేరెలుంగున నన్ననుసరించి వాపోవుచున్నట్లున్నది. ప్రాణేశ్వరా! నా యంగములయందు స్వయముగా నీవు రచించిన వసంత కుసుమాలంకార మిప్పటికిని జెక్కు చెదరక నిలిచి యున్నది. కాని నీవే యింతలో మాయమై పోయితివి. నా యీ పాడు దక్షిణపాదమునకు నీవు లాక్షారాగముం గూర్చు సమయమున దారుణ వర్తను లగు గీర్వాణులు తమ పని నెరవేర్చుకొను నిమిత్తము నిన్నుఁ దలవనితలంపుగా రప్పించుకొన్నారు. మనకుఁ బునస్సమాగమము ఘటియింపఁజేయుట వారికిఁగర్తవ్యముకాదా!

"మనోహరా! నాకలోకమునఁ జతురవర్తనలగు సురకామినీరత్నములు నిన్నుఁ గికురించి, వలపించి తమ యుచ్చులం దగిలించుకొనక మున్నే నే నగ్నిప్రవేశ మొనరించి నీసన్నిధానముం జేరుదును జూడుము. రమణా! నిన్నిపుడు నే ననుగమించినను దురవాపమగు నొక యపనిందనుండి మాత్రము నేను తప్పించుకొనఁజాలను. మదనుని మరణాంతర మొక్క క్షణమాత్రమే యగుఁగాక రతి బ్రతికియుండినదను నింద యవశ్యంభావిగా సంప్రాప్తించినదికదా! నీ శరీరము నయినను నిచ్చో నిలుపక పోయితివి. నే నింక నీ కేమి చరమాలంకారతి

మొనర్పఁ గలను. ఆ భాగ్యము సయితము నాకు లేక పోయి నదిగదా! నాయుత్సంగమునఁ దనువు నుంచుకొని, వంకపోయిన శరమును గరములం జక్కదిద్దుచుఁ, జెలికాఁడగు వసంతుని గూడి, మందస్మిత సుందర వదనారవిందుండవై సరస సల్లాప ముల నన్నలరించు నీ మధురమూర్తి నొక్కసారి మందభా గ్యురాల నగు నాకుఁ జూపరాదా? ఏడీ వసంతుఁడు నీ కూర్మి సఖుఁడు? ఆతండును నీతో భస్మమైనాఁడా యేమి? హా! పినాక పాణి కోపానల కీలల నాతండును బుగ్గియై పోయెనా? కుసుమ విసరములతోఁ గమనీయ కార్ముకమును రచించి నీకిం కెవరు తెచ్చి యిచ్చువారు? అయ్యో! మందబుద్ధిని. నీవే లేనప్పుడు పుష్పకోదండముతోఁ బని యెవ్వరికి?''

అని యిత్తెఱంగున విలపించు రతీదేవి యాలాపవచన ముల విని వసంతుఁడు విపలిప్తముఖ శిలీముఖ విదారిత హృద యుఁడై యత్యాపన్న యగు నా యన్నుమిన్న నాశ్వాసింపఁ దలంచి యామెను జేరవచ్చెను.

వసంతునిం జూచి మీనకేతనుని యిల్లాలు మఱింత కరుణముగా విలపించెను. దుఃఖవివశయై వక్షస్స్థలము వ్రయ్య లగునట్లు బాదుకొనియెను. బంధుజనముల మోల శోకార్తుల హృదయ కవాటములు బట్టబయలుగాఁ దెఱవఁబడును గదా!

తన హృదయేశుని నెచ్చెలిం జూచి 'వసంతుఁడా! కంటివా! నీ చెలికాని శరీరమును. బూదియైనాఁడు నీ కూర్మి సఖుఁడు. ఆ బూదియు మనకుఁ దక్కునట్లు లేదు. పవనుఁడా బూడిదను నలుదిక్కుల కెగఁ జిమ్ముచున్నాఁడు' అని యాక్రోశించి పలుమాఱు తన నాధునిఁ దలంచుకొని మరల నిట్లాక్రందించెను.

"ఆత్మేశ్వరా! యిపుడైన నొక్కసారి దర్శన మిమ్ము. చూడుము నీప్రాణసఖుఁడు మాధవుఁ డిట కరుదెంచి నిన్నాలోకించుట కుత్సహించియున్నాఁడు. అట్టిప్రేమనిధానమైన నీ వసంతుని కొఱకేని నొక్కతూరి నీదర్శన భాగ్య మొదవఁజేయుము. దయితల యందుఁ బురుషులకుఁ బ్రణయ మస్థిరమే యయినను మిత్త్రులయెడ నచంచలముగదా! సర్వవ్యాపారముల నీ వసంతుఁడు పార్శ్వవర్తియై నీ కమూల్యసాహాయ్య మొనర్చుచుండిన వాఁడే మఱచితివా! బిసకాండ గుణాన్వితమైన కోదండమునఁ జేలవకుసుమకాండములం బ్రయోగించి సురాసుర పరంపరా పరివృతసమస్తజగతీ విజయైక ధురీణుఁడవై విహరింప సమర్థుఁడవౌట యెల్ల నీ వసంతుని సహకారముననే కదా? ఆ యీ వసంతునిం బ్రోసిపుచ్చఁదగవా? రమ్ము రమ్ము."

ఇట్లు పరిపరి విధములఁ బలవరించి యానెలంత వసంతునితో "నాయనా! వాయుతాడితమైన దీపమువలె నీ చెలికాఁడు

ఆఱిపోయినాఁడు. మరలివచ్చునను నాశయు నంతరించినది. ఆ నష్టదీపమునకు దుఃఖధూమావృతమైన వత్తి వలె నేను మాత్రము మిగిలియున్నాను. హతవిధి నా పతిని మాత్రము చంపి, నన్ను విడిచిపెట్టి యిరువురం జంపిన పాపము మూటకట్టుకొన్నాఁడు. నిరపాయమని నమ్మిన మాశ్రయవృక్షమును ఘాతుకమాతంగము కూల్చివైచినది. ఆ విటపము నల్లుకొని యున్న వల్లరి చెల్లాచెదరై పోవక నిలుచునా? నీ విపుడు చేయవలసియున్న బంధుకృత్య మొక్కటికలదు, వినుము : వివశనగు నాకుఁ జితిపేర్చి నా పెనిమిటిం గలిసికొను తెరువు నాకుఁ గల్పింపుము. శశితోఁ జంద్రికయు, మేఘముతో సౌదామినియు నశించురీతిఁ బతిని బతివ్రత యనువర్తించును. నా ప్రియుని సుభగాంగభస్మమును మై నలందుకొని నవపల్లవతల్పమున నెట్లో యట్లు చిచ్చున శయనించెదను. ఓ సౌమ్యుఁడా! నీకు నమస్కరించుచున్నాను. విలంబము సైరింపఁ జాలను. వేగిరమ నా నిమిత్తమై కాష్ఠచయముం బేర్చి నా యభీష్టావాప్తికిం దోడ్పడుము. చితాకరణానంతర మద్దానికిఁ జిచ్చు ముట్టించి దక్షిణమారుతసంచారణముచే మంటను వృద్ధినొందించి పరలోక గతుఁడగు నా ప్రాణవల్లభుని పజ్జకు సత్వరమ నేఁ జేరుటకు సహాయపడుము. అంతతో నూరకుందువేమో! నేను దహింపఁబడిన యనంతరము నాకును నాజీవితేశ్వరునకు నొకే జలాంజలి

యొసంగుము. మే మిరువురమునుం గలిసి నీ విడు దోసెఁడు నీరమును బరలోకమునం ద్రావుదుము. రసాలసుమ ప్రియుండగు నామనోహరు నుద్దేశించి నీవు పిండోదకాది కర్మము లాచరింపవలసి యున్నందున విలోలపల్లవాన్వితము లైన సహకారమంజరులను బరలోకవిధుల కుపయోగింపుము."

అని దీనాననయై వచించి శరీరత్యాగమున కుపక్రమించి నంతనే రతీదేవితో నాకాశవాణి యిట్లు పలికెను: "ఓ యనంగ లతాంగీ! నీ పతి నీ కచిరకాలములోనే లభింపఁగలఁడు. ఏ పురాకృత కర్మవశమున నతండు హరలోచన జ్వాలికా మాలికల కగ్గమై శలభము చందంబున బుగ్గియయ్యెనో వచించెద వినుము. బ్రహ్మదేవుఁడు భారతీదేవిని సృజించి యామె లోక మోహనసౌందర్యముచే నాకర్షింపఁబడి తనచేఁ బుట్టింపఁబడిన యా పూవుంబోఁడినే మోహించెను, కొంతసేపటి కతఁడు తన యింద్రియవికారమును నిరోధించుకొని యిట్టి వైపరీత్యమునకుఁ గారణభూతుఁడైన నీ పతిని శపించినాఁడు. ఆశాపమే యీ నీ పతి మృత్యువునకుఁ గారణము. అట్లు నీ రమణుని శపించు ధర్మఁడను ప్రజాపతి చూచి విధాతను వేఁడగా నా భగవా నుండు కరుణించి తచ్ఛాపావసానము నిట్లు వక్కాణించెను. 'హైమవతి తన తపోనియతిచే హరుని మెప్పం గొని యద్దేవు నెన్నండు పెండ్లాడునో యా నిముసమునఁ బంచబా

ణుని బరమశివుఁడు లబ్ధశరీరుం జేయును.' కావున నో కల్యాణీ! నీవు వగవం బనిలేదు. కమలగర్భుని వాక్కు లమోఘములు. అశనిపాతమునకు నమృతవర్షమునకు నంబుధరము లెట్లు సమర్థములో యట్లే కమలగర్భునిఁబోలు జితేంద్రియులాగ్రహానుగ్రహములయందు దక్షులుగదా! శోకము మానుము. ప్రియసంగమయోగ్యమైన నీ శరీరమును నాశన మొనర్పకుము. దానిం బరిరక్షించుకొనుము. నీ జీవితేశ్వరునుండి నీకుఁ గలిగిన వియోగము స్థిరమని భ్రాంతివహింపకుము. నిదాఘ రవికిరణ జాలములచేఁ బీల్చి వైవఁబడిన జలప్రవాహము గల వాహిని ప్రావృడంబుద ప్రభావమునఁ బునర్లహరీ ప్రపూర్ణయై పురణించు ననుట యెఱుంగవా ? ఊరడిల్లుము. నీకు శుభమగుఁగాక."

అని యీరీతిగా నశరీరవాణి పలికినంతనే రతీదేవి సమాశ్వాసిత యయ్యెను. గ్రీష్మమున మడుఁ గెండిపోవ నైక్లబ్యము వహించిన శఫరి వర్షారంభమునఁ దెప్పిఱిల్లును గదా! ఆకాశవాణి యూఱడింపుమాటలచే రతీదేవి తన మరణ వ్యవసాయమును మానుకొనియెను. వసంతుఁడు నాకాశవాణి యాభాషణములయెడ విశ్వాసము నిలిపి, దేవతాప్రసాదమునఁ బ్రియసమాగమము సిద్ధించు నని రతీదేవితోఁ జెప్పి బహుభంగులనా మెకూఱటఁ గల్గించెను. వ్యసనకృశాంగియగు నత్తన్వియుఁ

గిరణ సంతతియు మలిన మగు పగటి చంద్రరేఖ రాత్రినిం బోలె విపదవధి నెదురుసూచుచుఁ గాలము గడపు చుండెను.

# గిరిజా కల్యాణము

## —: తపస్సిద్ధి :—

—(o)—

ఇత్తెఱంగున దననిమిత్తమై మనోభవుండు భవునిచే దహింపఁబడినందునఁ బార్వతి భగ్నమనోరథయై తన సౌంద ర్యమును నిందించుకొనియెను. ప్రియవాల్లభ్యమును లభ్యము చేసికొనం జాలని లావణ్యము నిష్ప్రయోజనముగదా! కావున నాబాల తన సౌందర్యము సఫలమగునట్లు సమాధి నవలంబించి తపమాచరింప నిశ్చయించెను. మృత్యుంజయుని భర్తగాఁబడసి యాతని యనురాగము లభింపఁజేసికొనుటకు నియమాధీనమైన తపము దప్ప గౌరికి వేఱుమార్గముగలదా?

శివాసక్తచిత్తయై తపస్సముద్యమబద్ధ మనోరథయగు పుత్త్రికను మేనకాదేవి చేరంజీరి యాలింగనము కావించు కొని యామె హృదయమును గ్రహించి "బిడ్డా! యేల యీ కఠినవ్రతమున కుద్యమించితివి? నీమనసునకు సరివచ్చు దేవతలు నీయింటలేరా? కుసుమకోమలమైన నీ శరీర మెక్కడ? తప స్సెక్కడ? శిరీషపుష్పము భ్రమరపదమును సహించునుగాని విహంగపాదము నోర్వఁ గలదా? యోచించు కొనుము.

దివ్యోపభోగయోగ్యమయిన నీదేహము దారుణతపము నోర్వఁజాలదు." అని పెక్కు తెఱంగుల బోధించెనుగాని గట్టిపట్టుదలగల పార్వతి తన యుద్యమమును వీడలేదు. ఇది సహజమే! ఈప్సితార్థములయెడ స్థిరనిశ్చయులైన వారి మానసములను నిమ్నాభిముఖములైన పయస్సమూహములను వలె వెనుకకు మరలించు టసాధ్యముగదా!

ఒనానొకదినమున మనస్విని యగు పార్వతి యాప్త సఖిం బిల్చి నిజమనోరధము నెఱింగిన జనకునికడకేగి, ఫలోద యాంతమైన తప మాచరించుటకు సాధనమగు వనవాసము సలుప ననుమతి యొసంగుఁడని వేఁడి రమ్మని పంపెను. గురు గుణ గరిష్ఠుండగు హిమవంతుఁడు పుత్త్రిక యభినివేశమునకు సంతసించి యామె కనుమతి యొసంగెను. పార్వతి సత్వరమ సాధుమృగ నివాసంబగు నొక శృంగముం జేరి తప మొనర్ప నారంభించెను. ఈ ప్రసిద్ధ శృంగమునకే లోకమున గౌరీ శిఖ రమని పేరువచ్చెను.

తపః ప్రారంభ సంరంభయగు పార్వతి యహార్య నిశ్చ యయై, పయోధరసంకలిత చందనలేపమును విలోల ప్రతిసర ములచేఁ దఱుచుగాఁ దుడిచివేయ సమర్థములైన ముక్తాహార ములఁ దీసివైచి, బాలార్కపింగళవర్ణవిభ్రాజితమైన వల్కల మును స్తనోత్తరీయముగాఁ దాల్చెను: జడలు ధరించెను. అయి

ననేమి? వన్నెఁదొలఁగెనా? లేదు. విభూషిత వేణీభరముచే నామె యానన మెట్లు మున్ను మధురముగానుండెనో యట్లే జటాభారముచేసైత మామెముఖము మురువుగులుకుచుండెను. పంకజము భ్రమరపరంపరచే నెట్లో యట్లే శైవలసంపర్కముచే సయితము ప్రకాశించునుగదా! నీహారగిరికుమారి వ్రతనియమ బద్ధయై మూఁడుపేటల మౌంజిని ధరించెను. దాని యొరపిడిచే నామె సుకుమార జఘనస్థానము కంది యెఱ్ఱవాఱెను. క్రీడా సమయముల స్తనాంగరాగ సాంగత్యమున నరుణీకృతమైన కందుకంబును స్పృశించుటచేనేమి, అధరమును లాక్షారాగ రంజిత మొనర్చుటచేనేమి, ప్రాయికముగా రాగిల్లు శైలకుమారి కేలుఁదమ్మి తపశ్చరణకాలమునఁ గుశాంకురాదాన పరిక్షతాంగుళియు, నక్షమాలాసాహచర్య విధేయమును నై రక్తిమం దాల్చెను. అమూల్య హంసతూలికా తల్ప పరివర్తన చ్యుతంబులగు కేశ కుసుమములచే సైతము క్లేశముం గాంచు సుకుమారగాత్రముగల పార్వతి సంస్తరణ రహితమగు స్థండిల ప్రదేశమునఁ దన బాహులతయే యుపధానముగా నుంచుకొని శయనించుచు, నట్టి కఠినస్థలములయందే యాసీన యగుచుఁ గాలము గడపుచుండెను. లతలయందు విలాసచేష్టితములను, హరిణాంగనలయందు విలోల దృగ్జాలములను నిక్షేపించి, మరలం దన కవసరమైనప్పుడు గ్రహించుట కనువుగా నేర్పఱించిన

దేమో యన గట్టురాచూలి చూపఱకుం దోఁచెను. నిస్తంద్ర మైన గిరీంద్రనందన తానే చిన్నచిన్న వృక్షములను ఘట స్తనపయస్సంచయములచే వృద్ధినొందించెను. ప్రథమలబ్ధజన్మ ములగు నా వృక్షకముల మీఁది పుత్త్రవాత్సల్యమును కుమారుఁడు సైతము తొలఁగింపఁ జాలఁడు. నీవారాది ధాన్యముల దోసిళులతో నందిచ్చి హరిణములం బెంచుచుఁ, దనయందలి విశ్వాసముచే సమీపగతములై తిరుగుచున్న యాకురంగములకన్నులతోఁ దనకన్నులను సఖులయెదుటఁ గొల్చుకొనుచు నామె కాలముం బుచ్చుచుండెను.

విధిచోదితముగాఁ దానమాడి హుతవహుని హోమాదులచే సంతృప్తునిం జేయుచు, వల్కలోత్తరాసంగవతియై నీలకంఠుని స్తుతించుచుఁ దపఃపరతంత్రయై యున్న పర్వతరాట్కుమారిని ఋషులు చూడవచ్చిరి. వయసునఁ బిన్నయయ్యు ధర్మమున వృద్ధయగు గిరిజాదేవిని మునులు చూడవచ్చుట యక్కజమా? ఆమె తపమొనర్చు శృంగమున జంతువులు జాతివైరము మానినవి: తరువు లతిథుల నభీష్టఫలాదులచే సమర్చించినవి: ఉటజాభ్యంతర ప్రదేశములు సంభృతాగ్నిహోత్రములై వెలింగినవి. ఇట్లే యాతపోవనము జగత్పావనమయ్యెను.

తా నాచరించు తపమువలనం గాంక్షితఫలము లభింపమి శరీర సౌకుమార్యము నేని సరకుసేయక గిరికుమారి యింకను దీవ్రతరమైన తపము సల్ప నమకట్టెను. బంతియాట వలన సైత మలంత వహించు చలిమలకూంతురు జడదారులకు మాత్రము అలవాటుపడిన నిట్టలపు నియమముల నుపక్రమించెను. ఆమె శరీరము సువర్ణకమలమని చెప్పుటలో నతిశయోక్తి సుంతేనియు లేదు. సౌకుమార్యగుణమున నామె తనువు కమలమువంటిది; కాంతికాఠిన్యములం బోల్చిచూడ నా కాంత నెమ్మేను కాంచనము వంటిది.

శుచిస్మితయు సుమధ్యయు నగు నప్పార్వతి గ్రీష్మమున దీప్తిమంతములైన నాల్గగ్నుల మధ్యప్రదేశమున నుండి మిఱుమిట్లు గొల్పు సూర్యతేజస్సుపై దృష్టి నేకాగ్రతతో నిలిపి తపమాచరించినను నామె యాననము వాడువాఱక చండగభస్తికిరణముల సోంకునం గమల మెట్లు వికసించునో యట్లే కాంతిల్లెను. ఆమె దీర్ఘాపాంగములయందుమాత్రము మెల మెల్లంగాం గొంత నలుపు నెలకొనియెను.

అప్రార్థితప్రాప్తములైన నీరములను, సుధామయములైన చంద్రకిరణములను మాత్ర మాహారముగా గ్రహించి మంచుమల ముద్దుంగూంతురు తరువులకరణిం గాలముగడపెను. నీరంధ్రవర్షాడంబర వేళలం బెనుగాలి వీచుచుండ శిలాతలశాయి

2/21
1772


నియై యున్న శైలతనయను విద్యుల్లతాలోచనలగు కృపా క్రాంత లాలోకించుచు నాబాలిక చేయు తీవ్రతపోనియమవ్యాపా రములకు సాక్షిణులై యున్నవారని తోఁపింపఁజేయుచుండిరి. మంచు తెరలఁ గ్రుమ్మరించు వాయువులు వీచు పౌషమాస రాత్రివేళల నీట నివసించి, నీహార శైలాత్మజ యొండొంటి నెడఁ బాసి విలపించు చక్రవాక మిధునములఁ గృపావతియైచూచుచు దినములం ద్రోచెను.

తమంతటఁ దామే రాలిన తరుపర్ణముల నాహారముగాఁ గొని జీవించుచుఁ దపమొనరించుట మునివృత్తికిఁ బరాకాష్ఠ. పర్ణభక్షణము సైతము పార్వతి మానినందున నాప్రియంవదను పురావిదులు 'అపర్ణ' యని పిలిచిరి. ఇది సమంజసమేకదా! ఇట్లా గట్టురాచూలి పద్మినీకందకోమలమయిన తన దేహము తోయాగ్ని మధ్యవాసవ్రతాది నియమములచే నహోరాత్ర ములం గరము గృశింపఁజేయుచు, కఠినశరీరార్జితమైన తపస్సుల తపస్సంపన్నతనుగూడఁ గ్రిందుపఱచి మఱింత మహిమ సంపా దించెను.

అట్టియెడ నొక్కనాఁ డుమాతపోవన వాటికి అజినాషా ఢధరుండును, బ్రగల్భవాక్చతురుండును, బ్రహ్మతేజో విరాజి తుండును, రూపెత్తిన బ్రహ్మచర్యాశ్రమమో యనఁ బరిఢవిల్లు

వాఁడును నగు జటిలుఁడొక్కండు విచ్చేసెను. అతిథేయి యగు నయ్యగజ వటువున కెదురేగి నాతని గౌరవపూర్వకముగా సమర్చించి తోడితెచ్చెను. సర్వసమవృత్తులయ్యును స్థిరవృత్తులైన వారలు వ్యక్తివిశేషములయెడ నత్యాదరక్రియలు నెఱపుదురు కదా! ఆ బ్రహ్మచారి విధ్యుక్త సత్క్రియలఁ బరిగ్రహించి క్షణముసేపు పరిశ్రమముం దీర్చుకొనినట్లు నటించి విలాసరహితమైన చూపుతో సముచితపరిపాటీసమేతమైన వాక్కుతో నిట్లు పలుకఁదొడంగెను :

" హోమాది కర్మానుష్ఠానమునకు వలసిన సమిధలును గుశలును సులభముగా లభ్యములగుచున్నవా ? స్నానవిధికి యోగ్యములైన జలములు దొరకుచున్నవా ? నిజసామర్థ్యానుసారముగాఁ దపమొనరించుచున్నావా ? శక్తినతిక్రమించి సలిపిన తపము సుఖసంవర్ధకము కానేరదు. శరీరము ధర్మమునకు ముఖ్యమైన సాధనముగదా! నీచేఁ బెంపఁబడుచున్న లత చిగురువేయుచుఁ గ్రమక్రమముగా వర్ధిల్లుచున్నదా ? చంచలవిలోచనములతో హరిణములువచ్చి నీ కరమున నుండు దర్భలఁ జనవున మేసిపోవ నుంకించునెడఁ గోపించి వానిం జంకింపవుగదా ? ఓ వివేకవతీ! "న సురూపాః పాప సమాచారా భవన్తి" యను సూక్తి సత్యమని నీ వెఱుంగుదువు. నీ శీలము మునులకేని ప్రమాణమని చెప్పుటకు సంశయింపను. సప్తర్షుల పుష్పో

పహారములతోఁ గూడిన దివిజగంగాసలిలము లేనియు నిష్కలుషచరిత్రవగు నీవలె సపుత్త్రపౌత్త్రుఁడగు హిమవంతుని బవిత్రీకరింపఁజాలవు.

"ఓ సదాశయా! అర్థకామములను వర్జించిన బుద్ధితో ధర్మమును మాత్రమే నీ వాచరించుటచే వర్గత్రయమున ధర్మమే సాతిశయమనియు సారతమమనియు నాకుఁ దోఁచు చున్నది. ఓ యవనతాంగీ! నీవు నన్ను సత్కారవిశేషముచే నాదరించితివి. నన్నుఁ బరునిగా నెంచఁ దగదు. సాధు సాంగత్యము సాప్తపదీనం బని యార్యులు వచింతురు. సాధుగుణసంపన్నవగు నిన్ను ద్విజాతిస్వభావోపపన్నమైన చాపలముచే నొక ప్రశ్న యడుగఁదలఁచితిని. నీ కిష్టమేని ప్రత్యుత్తరము వచింపుమని వేఁడుచున్నాను.

"నీవు హిరణ్యగర్భుని ప్రసిద్ధాన్వయమున జన్మించిన దానవు. నీశరీరమున లోకత్రయ సౌందర్యము పుంజీభూతమై యున్నది. ఐశ్వర్యసుఖమన్ననో నీ వన్వేషింపఁ బనిలేదు. ఎల్ల ప్రాయమున నున్నావు. ఇట్టి సర్వలక్షణాఢ్యవైన నీ కేమి కొదవ. ఏ ప్రయోజనము నర్థించి నీ వీయుగ్రతపము సలుపు చున్నావు? ఎవరేని నీ కప్రియ మొనరించిరా? మనస్వినివగు నీవంటి నెలంత కిట్టి దుస్సహప్రవృత్తి యేకారణమునఁ బొసంగె

నది? విచారించి చూచిన నట్టి యనిష్టము నీ కెవ్వరేని సలుపుట కవకాశము కానరాదు.

"పితృగేహమునఁ దిరస్కారము వాటిల్లెనా? అది యసంభవము. పరులవలనఁ బరిభవము కలిగి యుండుననుట కల్ల. ఫణిశిరోమణీశలాకను సంగ్రహించుట కెవఁడు చేయిచాఁపును? ఏ కతమున నీ యెలఁబ్రాయముననే యాభరణముల నెల్లఁ బరిత్యజించి వార్ధకదశా యోగ్యములైన వల్కలముల ధరించితివి? స్వర్గము నాశించి యీతప మొనర్చుచుంటివేని నీ యత్నము వ్యర్థమని తలంచుచున్నాను. నీ తండ్రియగు హిమవంతుని నివాసము దేవతలకు స్థానముగదా! వరుని నిమిత్తమై నీ వీ తపము సలుపుచున్నావా యేమి? అది నీకుఁ దగిన పని కాదు! రత్న మొకని వెదకునా? దానినే కోరి యితరులు వత్తురని వేఱుగా నేను నీకుఁ జెప్పవలయునా? వరార్థినివై నీ వీ కఠోర తపము నెఱపుచున్నావని నీ వేడినిట్టూర్పు సూచించుచున్నది. త్రిభువనములో నీచేఁ గాంక్షింపబడిన వాఁ డెవ్వం డేనియుం గలఁడా? నీచేఁ బ్రార్థింపఁబడియు నీకు దుర్లభుఁడగు వాఁ డుండుట కల్ల. నీవు వలచిన యా వజ్రహృదయుఁ డెవ్వఁడు? చెక్కిళ్లపైఁ జెల్లాచెదరుగాఁ గలమాగ్రములలీల వ్రేలాడు పింగళ జటామాలికలతోఁ గర్ణోత్పలశూన్యవై యీచందమునఁ దపముచేయు నిన్ను పేక్షింప సాహసించిన యువకుఁ డెవ్వఁడు?

ముని జనోచితములగు చాంద్రాయణాది నియమములం బూని యత్యంత కృశీకృతాంగివై వాతాతపములచేఁ గమలిన భూషణ స్థానములతో ననుకంపార్హవై యహస్సమయ శశాంక రేఖవలె నున్న నిన్నుం గనినచో నేమానవుని మానసమైనను బరితపింప కుండునా ? మధుర దృఙ్మంజుల మూర్తివగు నీకు నీప్రియుఁడు తనమోముం జూపక యాలసించెనేని యాతఁడు సత్యముగా స్వీయ సౌందర్య గర్వ వంచితుఁడే యని వచించుటకు సంశయింపను. ఎంతకాల మీలీలఁ దపించెదవు ? బ్రహ్మచర్యమున నే నార్జించిన తపోధనమున నిక్కముగా నీకు సగపాలొసంగెదను. నీవు కాంక్షించు వరుని లభింపఁజేసికొనవచ్చును. నుడువుము నీవెవ్వానిం గోరితివి ?''

అని యివ్విధమునఁ బ్రశ్నించిన బ్రహ్మచారికి గౌరి దన మనోగతార్థముం దెలుప లజ్జించి చెంతనున్న వయస్యపై వర్జిత కజ్జలములైన లోచనములతో దృష్టిం బఱపి కనుసన్న యొనర్ప నింగితజ్ఞయగు నా చెలి యవ్వటువుం జూచి ''ఓవిద్వాంసుఁడా! వినఁ గుతూహలపడుదువేని వక్కాణింతు నాకర్ణింపుము. అభిమానవతియగు నీయుమాకన్య యధికైశ్వర్యవంతులగు చతుర్దిగీశులంగూడ సరకుకొననిదై, సౌందర్యముచే వశీకరింపరానివాఁడును మదనవిరోధియు నగు పినాకపాణిని భర్తగాఁ బడయఁగోరి యంబుజము నాతపత్రముగాఁ బట్టిన

వెరవునఁ దనసుకుమారశరీరమును దపస్సునకు సాధనముగా నియోగించినది. కందర్పుఁడు నష్టశరీరుఁడైనను గరళకంఠుని హుంకారముచే నివర్తింపఁబడిన కామబాణము మాచెలి హృదయమున లోఁతుగా నాటుకొనినది. అప్పటినుండియు నీబాల సముత్కట మన్మథయై, లలాటికా చందన ధూసరాలకయై, తపించుచున్నది. సబాష్పకంఠవిశీర్ణవాక్కులతో శంకరచరిత్రముం బాడుచు, వనాంతమున సంగీతసఖులగు కిన్నరరాజకన్యల విలపింపఁజేసినది. మఱియు రాత్రివేళలయందు నాల్గవజామున మాత్రము క్షణముసేపు నిమీలితనేత్రయై యుండి యీమె తటాలున లేచి ‘ఓ నీలకంఠా! ఎచ్చటి కేగుచున్నావు?’ అని నిర్వ్యపయవచోవిశేషయై, యసత్యకంఠార్పితబాహుబంధయై మేలుకొనుచుండినది; చిత్రగత చంద్రశేఖరు నుద్దేశించి యేకాంతమున నీయెలనాగ ‘సర్వగతుఁడవని నిన్ను బుధులు వాకొందురే, నీయం దనురాగము నెలకొల్పిన నన్నే నీవెఱుంగకుండు టెట్లు?’ అని అధిక్షేపించుచుండినది. ఇప్పగిది జగత్పతియైన పరమేశ్వరు ననుగ్రహసిద్ధికై పరితపించి యుపాయాంతరము లభింపమి గురునను జ్ఞ వడసి మాతోఁ గూడివచ్చి యిటం దపము నాశ్రయించినది. మాచెలి యౌవనమున నాటిపెంచి పెద్దవిగావించిన తరువు లీమె తపమునకు సాక్షులు. ఈ తరువులును ఫలించినవి కాని యీ మొఱఁ జంద్రశేఖరునిపైఁ

గల మనోరథము ఫలించుట మాటయటుండ నంకురోన్ముఖ మేనియుం గాలేదు. ప్రార్థింపఁబడినను సాక్షాత్కరింపని యా దేవుఁడు తపో వ్యథా కృశాంగియై శోచనీయయైన మా చెలిని, అనావృష్టిపీడితమగు నాగేటిచాలును వాసవుఁడుం బోలె, ఎప్పు డనుగ్రహించునో యెఱుంగ'' మని యిత్తెఱంగున సదభిప్రాయము ప్రకాశితమగునట్లు నివేదింపఁగా సుందరుఁ డగు నా నైష్ఠికుఁడు అవ్యంజిత హర్షలక్షణుఁడై "ఓ శుభ లక్షణా! నీ సఖివాక్యములు పరిహాస భాషితములా యేమి?'' అని యడిగెను. అంతట నయ్యద్రినందన ముకుళీకృతాంగుళి యైన ముంజేత స్ఫటికాక్షమాలిక నుంచుకొని లజ్జాభరముచే మాటాడ నిష్టపడక ధైర్య మవలంబించి పరిమితవర్ణమైన భాష ణమున నిట్లు పలికెను: "ఓ వేదవిదగ్రణీ! మా చెలిమాట సత్యమే! నేను శివలాభరూపోన్నతస్థాన మాక్రమింపఁగోరి యుండుట నిక్కవమే. తన్నిమిత్తమే యీతపముఁ జేయుచు న్నాను. స్వశక్తిపర్యాలోచనము లేకయే మానవుల మనోరథ ములు ఎట్టి విషయముల మీఁదనేనిఁ బ్రసరించును గదా!''

ఇట్లాతన్వి పలికినంతనే బ్రహ్మచారి "మహేశ్వరుఁడు నే నెఱుఁగనివాఁడు కాఁడు. అమంగళాభ్యాసలాలసుఁడగు నాతని నీవా వాంఛించుట? నీ యనువృత్తి ప్రశంసార్హము కానేరదు. తుచ్ఛపదార్థముపై నలవఱచుకొన్న నీ యీ యభి

నివేశముం గూర్చి నే నేమనఁగలను? ఆముక్తహస్తసూత్రమైన నీ పాణిని గల్యాణవేళ నీలకంఠుఁ డహికంకణోగ్రమయిన హస్తమున గ్రహించినపుడు నీ వెట్లు జంకకుందువు? నీవే స్వయముగా నాలోచింపుము. రాయంచ యంచులతో రంజిల్లు వధూదుకూలముందాల్చు పెండ్లికుమారితను ఆర్ద్రగజాజినధారియైన వరునకిచ్చి వివాహము జరిపినచో వారిసంయోగము యోగ్యమైనదని తలంచు వారుందురా? కుసుమావకీర్ణ దివ్యభవన సంచారోచితములై లాక్షారాగ రంజితములై యొప్పు పదములభాసిల్లు నీవు శవకేశపాశ సంభృతములైన ప్రేతభూములలో సంచరింపఁ జూచుటకుఁ గ్రూరకర్ములగు శాత్రవులుసైత మంగీకరింతురా? త్రినేత్రుని యాలింగనలాభము నీకు సులభముగానే లభించును. తత్ఫలముగా హరిచందనాస్పదమైన నీ వక్షమున శ్మశానభస్మ మంటుకొనుటతక్క మఱేమి పొసంగును? ఇది యుక్తమా వచింపుము. మొట్టమొదటనే వేళోకపరిహాసమునకు నీవు పాత్రమ వగుదువు. గంధగజేంద్రము నెక్కి యుత్సహింపవలసిన దానవు ముసలియెద్దు నెక్కి యూరేగుదువా! జనులెల్లరును నిన్నాలోకించి పరిహసింతురు. ఇదియే నీకు సంప్రాప్తింపఁబోవు భాగ్యవిశేషము. నిత్యకాంతిమతియైన చంద్రరేఖ యిప్పటికే శోచనీయతం గాంచినది. లోకత్రయ నేత్రకౌముదివైన నీవును బినాకపాణి

సమాగమముఁ గాంక్షించిన దానవగుటచే నిప్పుడు శోచనీయ లిరువురైనారు. విరూపాక్షుఁడు సుందరవదనుఁ డని తలంచితివా? అజ్ఞాతజన్ముని( జేపట్టు కన్నియ లుందురా? పోనీ, యీతఁడు విత్తవంతుఁ డగుటచే వలచితినని చెప్పుకొనుటకైన నవకాశము లేదే! ఇతని దిగంబరత్వము నారసి స్థితిగతుల గ్రహింపలేకపోయితివా? ప్రపంచమున వరుల యందు ఏ లక్షణములు సామాన్యముగా జనులు విచారింతురో వానిలో నొక్కటియైనను ముక్కంటియందుఁ గలదా? ఓ బాలమృగేక్షణా! యీ యసాధుమనోరథమును నీవు పరిత్యజింపుము. ఆతఁ డెక్కడ! పుణ్యాలక్షణవగు నీ వెక్కడ? పశుబంధన సాధనభూతమైన సంస్కృతదారువున నొనరింపఁదగు వైదికక్రియలు సాధువులు శ్మశానశూలముల నొనర్తురా?''

అని విరుద్ధవిధముగాఁ బలికినంతనే పార్వతి వేపమానాధరయై, వికుంచిత భ్రూలతయై, ప్రాంతలోహిత విలోచనములతో బ్రహ్మచారి నోరచూపునం జూచి "ఈశ్వరుని నీవెఱుంగవు, ఇది సత్యము. ఎఱింగినచో నిట్లు పలుకవు. అచింత్య మహిమాఢ్యులును అలోక సామాన్యులును అగు మహాత్ముల చరిత్రములను మూఢులు దూషించుట సహజమే! అనర్థ పరిహారార్థులును విభూతికాములును గంధమాల్యాదికములను సేవింతురు గాని

జగచ్ఛరణ్యులును నిరభిలాషులును అగువారు అంతఃకరణ వృత్తిని దృష్టాదూషితములుగా నొనర్చు మంగళద్రవ్యముల వాంఛింతురా? దరిద్రుఁడయ్యును శివుఁడు సంపదలకుఁ గారణ భూతుఁడు; శ్మశానాశ్రయుఁడయ్యును శంకరుఁడు త్రిలోక నాథుఁడు, భీమరూపుఁడయ్యును పినాకపాణి సౌమ్యుఁడు. ఆతని యాథార్థ్యము నెఱింగినవారే లేరు. తేజోమూర్తియగు శివుని శరీరము వెలుఁగఁజేయునవి దివ్యరత్నమయభూషణములు మాత్రము కాదు; సర్వమయుఁడగు శర్వుఁడు సర్పములనేని ధరించి ప్రకాశింపఁగలఁడు. హరుఁడు దుకూలములఁ దాల్చి యెట్లో గజాజినములఁ దాల్చియు నట్లే రాజిల్లఁగలఁడు. ఆతఁడు కపాలమునేనిఁ జూడారత్నముగా ధరించి తేజరిలఁ జాలును. భర్గాంగసంసర్గముచే వల్లకాటి బూదియుఁ బరమ పవిత్రమగుటయే కాక సర్వమాలిన్యమును బోనడంప సమర్థ మగును. పరమేశ్వరతాండవాభినయ క్రియా పరిచ్యుతములైన భస్మరజోలేశములను దేవతలు తమ సిగలం దాల్చుచున్నారు కదా! దానధారామండిత దిగ్వేదండము వాహనముగాఁగల మహేంద్రుఁడు సైతము వృషభారూఢుఁడును దరిద్రుఁడును గానున్న శివుని చరణములఁ దనఫాలముసోఁక నమస్కరించి తన సిగలోనున్న వికచమందారకుసుమముల పరాగముచే నా దేవుని పాదపంకజముల నరుణీకృత మొనర్చుట లేదా!

శంకరుని కేమి కొదవ? దురాత్ముఁడవై దోషములనే యెత్తి చెప్పినను శివుని గూర్చి నీ వొక్క సత్యము వక్కాణించితివి; ఆతని జన్మము నెఱుఁగ రాదంటివి. అది యధార్థమే. బ్రహ్మకు సైతము జన్మకారణము పరమేశ్వరుఁడే యని విద్వాంసులు చెప్పుదురు. అట్టి యీ శంకరుఁడు లక్ష్యజన్ముఁ డెట్లగును? నీతో వివాదమేటికి? ఎట్టివాఁడని యీశ్వరుని నీవు వర్ణించితివో యాతఁడట్టివాఁడే యగుఁగాక! శంకర భగవానునియెడ నామానసము *భావైకరసమై యున్నది. స్వేచ్ఛాసంచారముగలవారు లోకాపవాదమునకు వెఱవ రని యెఱుంగుము" అని పలికి సఖిం బిలిచి "యీ వటుఁ డింకేమో మరల మాటాడఁ బోవు చున్నట్లున్నది. పెదవులం గదలించుచున్నాఁడు. ఇతని యత్నము నివారింపుము. పూజ్యుల దూషించువారికే గాక వారివచనముల వినువారికి సైతము పాపమంటును. ఇతనితో నాకుం బనియేమి? ఇటనుండి మరలి పోవుటయే సముచితము" అని చెప్పి గిఱుక్కున మరలి రెండడుగులు వేయఁ గొండరాచూలి కుచమండలమునుండి నారచీర జాఱెను. కుహనావటువు తటాలునఁ బరమశివుఁడై మందహాస చంద్రికలు వదనబింబమునఁ దాండవింప గిరిరాజకుమారిం జేపట్టెను. ఆమె కంపవతియై స్విన్నగాత్రియై యెత్తినపదమును

* శృంగారము అద్వితీయమైన రసముగాఁ గలది.

దింపకయట్లే నిలిపి సంభ్రమచేతస్కయై నిలువంబడెను. ప్రవహించు మార్గమునఁ బర్వత మెదురైనచో వాహిని యాకులతం జెందునట్లు శైలతనయ లజ్జాభరమునఁ దాఱుమాఱయ్యెను. అంతఁ జంద్రచూడుఁ 'డో యవనతాంగీ! నీ వీ దాసుని తపోధన మిచ్చికొంటివి. నేఁడు మొద లీ దాసునిచేఁ బనిగొనవచ్చును' అని పలికి నంతనే పార్వతికిఁ దపోజన్యక్లేశమంతయుం బోయెను. ఫలసిద్ధిగాంచిన మానవులు క్లేశమును క్లేశమునుగా గణింపరు గదా!

———

# గిరిజా కల్యాణము

## ఉమా ప్రదానము

—:(o)—

విశ్వస్వరూపుఁడైన శివుడీసరణి సాక్షాత్కరించి తిరోహితుండైన పిమ్మటఁ బార్వతి సదనముం జేరి రహస్యముగాఁ జెలిమికత్తియ మూలమున హరుని కొక సందేశ మందఁజేసెను. హిమవంతునిచేఁ దాను దానధారాపూర్వకముగా నొసంగఁబడినచోఁ బశుపతి పరిగ్రహించుటయే మహానుగ్రహ విశేషమని గౌరి సందేశ మగుట 'నట్లేయగుఁగాక' యని శివుఁడు బదులుచెప్పి పంపెను. నిజ మనోరథము సిద్ధించుసమయము నిరీక్షించుచు వరునియెడఁ బరమాసక్తయై, వసంతానురక్తయగు చూతశాఖ పరభృతోన్ముఖియై క్రాలుకైవడి శైలతనయ కాలము గడపుచుండెను.

కల్యాణోత్సుకుఁడగు స్మరశాసనుఁడు తత్కార్యసంఘటనకై నియోగింపఁ దేజోరూపులగు సప్తర్షుల స్మరించెను. తత్క్షణమే యాతపోధనులు స్వీయ ప్రభామండలములచే వ్యోమమార్గముం బ్రకాశింపఁజేయుచు నరుంధతీసమేతులై వచ్చి యీశునిమ్రోలఁ బ్రత్యక్షమైరి.

ఆ మునిచంద్రులు ముత్యాల జన్నిదంబులఁ దాల్చి, హైమవల్కలంబుల ధరించి, రత్నాక్ష సూత్రములచే మెఱయు కరములతో నొప్పారుచుండిరి. వానప్రస్థాశ్రమము నవలంబించిన మందారవృక్షములవలె వారు నయనానందకరులై యుండిరి. కల్పతరు కుసుమ విసరముల కలయికచే దివ్యగంధము నీనుచు దిగ్గజ మద సౌరభ్యము గుబాళింపం బ్రవహించు స్వర్గంగాలహరులయందే వారు తానమాడుదురు. రథమును విగతకేతనముగా నొనర్చి సూర్యుఁడు సప్తర్షిమండలము క్రిందుగాఁ గడుజాగరూకతతో నడపించుచు నావహానిగ్రామణులకుఁ బ్రదక్షిణ మాచరించి వారి యనుమతిం గొనికాని యవ్వలికిం దాఁటి పోవఁడు. ప్రళయవేళలయందేనిఁ జెడిపోవని మహిమగలవారగుటచే వారు జగద్వంద్యులు. పురాణవిదులగు వ్యాసాదులు సైతము వారిని పురాతన స్రష్టలని కీర్తించి యున్నారు.

అట్టి మహిమలచే వెలుంగు మునీంద్రులనడుమ భర్తృపాదార్పితదృష్టియై యరుంధతీదేవి మూర్తీభవించిన తపోవిశేష మోయనఁ బ్రకాశించుచుండెను. పరమేశ్వరుఁ డామునివతంసులం గాంచి వారలను అరుంధతీదేవిని సమానముగా గౌరవించెను. సాధువులు గుణముం బూజింతురు గాని స్త్రీపుంవిభేదముం బాటింపరుగదా !

అరుంధతీదేవిం జూచుటతోడనే యీశ్వరునికి దారపరి గ్రహేచ్ఛ గాఢమయ్యెను. యాగాదిక్రియలకుఁ బతిదేవత లగు భార్యలుండు టత్యవసరముగదా !

సాంగవేదప్రవక్తలగు సప్తర్షులు దేవదేవుని దర్శించుట వలనం గలిగిన పరమానందమునఁ బులకితగాత్రులై యాజగద్గు రువుం బూజించి యద్దేవునితో నిట్లు విన్నవించిరి:–"నియమపూ ర్వకముగా నామ్నాయముల నధ్యయనము చేసినందులకును, విధ్యుక్తముగా హుతవహుని హోమాదికర్మములచే సంతృప్తుం గావించినందులకును, జాంద్రాయణాది తపములాచరించినందు లకును బ్రయోజనము మాకిప్పుడు సిద్ధించినది. జగత్ప్రభులగు మీ మనోదేశము లగోచరములు. అట్టి మీహృదయస్థానము మే మాక్రమించుట మాభాగ్యవిశేషము. ఎవని చేతఃపీఠమున మీరుందురో యాతఁడే ధన్యశ్రేష్ఠుఁడు. వేదప్రమాణకమైన మీమానసమున నెవ్వాఁడుండునో వాఁడిట్టివాఁడని చెప్పనలవి యగునా ? సోమార్కులకంటె నుచ్చైస్తరమగు పదవి మా కిప్పుడు లభించినది. మీసత్కృతివలన మీగుణములయందు మాకిప్పుడు విశ్వాసము లభించినది. మా కొదవిన యానంద మిట్టిదని సర్వసాక్షులరగు మీకు మేము నివేదింపవలయునా ? మిట్టిదని గ్రహింప లేకున్నారము. బ్రహ్మవిష్ణుమహేశ్వరుల స్వామీ! మాబ్రోల సాక్షాత్కృతింగాంచిన మీ సత్యస్వరూప

యాకృతులలో నిది యెవ్వాని స్వరూపమో తెలియం జేయుఁడు. మేము తమ కింకరులము. మాకర్తవ్యమెద్దియో యాజ్ఞాపించిన నెఱవేర్చుటకు సంసిద్ధులమై యున్నారము.''

చంద్రకళావతంసుఁ డంతట దంతకాంతులఁ గకుబంతముల వెలయించుచు మునులంజూచి ''పూజ్యులారా! నా ప్రవృత్తి పరార్థప్రవణమని మీరెఱుంగుదురు. తృష్ణాతురములగు చాతకములు తాపోపశాంతికరములగు వర్షజలములకై వారిదముం బ్రార్థించు పోలికఁ ఈయదనున శత్రుపీడితులగు దేవతలు విపత్పయోధినుండి తమ్ము రక్షింప సమర్థుఁడైన కుమారునిం గనుమని నన్నుఁ బ్రార్థించిరి. వారి వేఁడుకోలునకు నే నీయకొంటిని. అనలోత్పాదనార్థమరణి సర్థించు కరణి బుత్త్రోత్పాదనము నిమిత్తము హిమవత్కుమారిం బరిగ్రహింప నిచ్ఛగించితిని. కావున మీరు నాకై హిమవంతుని కడకేగి యాతని వేఁడి కార్యము నెఱవేర్పవలయును. సాధుసంఘటితమైన సంబంధము లెన్నటికిని వికలతంగాంచవు. ఉన్నతుఁడును స్థితిమంతుఁడును భూభారనిర్వహణ సమర్థుఁడును అగు హిమవంతునితో సంబంధము నాకును నపేక్షణీయమే. హిమవంతునితో మాటాడవలసిన పద్ధతి మీకు నే నుపదేశింప వలయునా? మీరు విద్వాంసులరు. పరుల కాచార ముపదేశింపవలసివారు గదా. మీరు! లోకపూజ్యయగు నరుంధతీదేవియు వివాహ

కృత్యముల యందు సాహాయ్యమొనరింప సమర్థురాలు. ఇట్టివిషయములయందు పురంధ్రులేకదా చాతుర్యధుర్యలు. కావున మీరు హిమవన్నగరమగు నోషధిప్రస్థమునకేగి కార్య సిద్ధికై కడంగుఁడు. మరల నన్నిమహాకౌశీనదితీరమునం గలసి కొనుఁడు.'' అని పలికినంతనే మునీంద్రు లందుల కంగీకరించి పర మేశ్వరు ననుజ్ఞవడసి కదలిరి. యోగిజనాగ్రణియగు పరమశివుఁ డే పరిణయోత్సుకుఁడగుట సప్తర్షులు తాము గార్హస్థ్య మవ లంబించినందులకై పూనిన లజ్జ నుజ్జగించి శివకార్యార్థులై మనో వేగమున నంబరమార్గమున నెగసి యోషధిప్రస్థముం జేరిరి.

ధనసమృద్ధులకుఁ దావలమైన యలకానగరముం దెచ్చి యిట నుంచిరా యేమి? స్వర్వాసులు నివాసప్రదేశము చాలనం దునఁ దమ నెలవును వీడి వచ్చి యిటఁ గ్రొత్తనివేశముం గల్పించి కొనిరా యేమి? యని సంశయింపఁదగి యోషధిప్రస్థనగరము రాజిల్లుచుండును.

గంగాప్రవాహములే యప్పురమునకుఁ బరిఖలై యొ ప్పారుచుండును. ప్రకాశమానములైన యోషధులే రాత్రి వేళల యం దానగరప్రాకారమధ్యప్రదేశముల దీపములుగా వెలుఁగు చుండును. తత్ప్రాకారములు దివ్యవిపుల మణివితానవిరాజ మానములై యలరారుచుండును. ఆపుర మకృత్రిమ దుర్గ సంవర ణమై మనోహరమైయుండును. ఆవీటియేనుఁగులు సింహములం

జూచి భయమొందవు. ఆ నగరిగుల్మములు బిలప్రభవములు. పౌరులు యక్షకింపురుషులు. స్త్రీలు వనదేవతలు. ఆపట్టణము మేడలు మేఘమండలమును దాఁకుచుండుటవలనఁ దన్నగర గాయక గాంధర్వకళావ్యాపారమున ప్రయోగింపఁబడిన మృదంగముల నాదములు మేఘానుగర్జితములా యనుసంశయమున కాస్పదము కాఁగాఁ దాడన విశేషములచేమాత్రము మురజస్వనములని స్పష్టీకరించుటకు సాధ్యములగుచుండెను. కల్పద్రుమ విలోల విటపాంశుకములే తన్నగరభవనములకు అయత్నలబ్ధ యంత్రపతాకములై జోకంగూర్చుచుండును. స్ఫటికశిలానిర్మితములగు హర్మ్యములపైఁగల పానగోష్ఠీప్రదేశములలో నిశా సమయములయందు నక్షత్రములు ప్రతిబింబించి ప్రాయికముగా మౌక్తికోపహారత్వము నాపాదించుచుండును. ఆ పత్తనమున జనులు నిత్యయౌవనులు. మూర్ఛలంగాని మృత్యువుంగాని వారెఱుంగరు. పౌరులకు శత్రుభయమే లేదు. గంధమాదన మాపట్టణమునకు బాహ్యోద్యానము. సంతానతరుప్రసూనములనుండి వచ్చు సౌరభ్యము నల్దిశల బుగులొ్కనుచుండఁ జల్లని నీడలలో విద్యాధరాధ్వగులు నిదాఘవేళల గంధమాదనమున నిద్రించుచుందురు.

అట్టి హిమవద్రాజధానిం గాంచి సప్తర్షులు ''మనము స్వర్గము నభిలషించి యెంత తపమాచరించితిమి. ఈపురీలలామ

మున నివసించియుండఁగలిగితిమేని అట్టి క్లేశము ననుభవించి యుండముగదా!'' యని తలంచి, చనిచని ప్రతీహారులం దాఁటు కొని వడిగా హిమవంతుని భవనమునం బ్రవేశించిరి. చిత్ర పటాంతర్గతమైన యనలమువలె నిశ్చలమైనజటాకలాపములతో నాకాశమునుండి వృద్ధానుక్రమముగాదిగిన యామునిపంక్తితో యాభ్యంతరమునఁ బ్రతిబింబించిన భాస్కరపరంపరవలెఁ దేజ రిల్లెను. ధాతుతామ్రాధరుండును మహోన్నతుండును దేవదా రుద్రుమ సముదగ్ర భుజస్తంభుండును విశాలశిలోరస్కుండును నగు హిమవంతుఁడు గంభీరపాదవిన్యాసములతో వారల కర్ఘ్య మొసంగ నెదురేగి, శుద్ధాంతమునకుందోడితెచ్చి యర్హాసనమ్ముల ... సనము లొసంగి విధ్యుక్తరీతులం బూజించి తచ్చరణాంబువుల నొదలందాల్చి ప్రాంజలియై వారితో ''సంయమీంద్రులారా! మేఘోదయము లేని వర్షమువోలెఁ, బుష్పింపకయే పండినపండు పగిదిఁ దలవని తలంపుగా సమకూరిన మీదర్శనము నన్ను మహా నందమున ముంచివైచినది. మూఢుఁడు బ్రహ్మజ్ఞానియైన ట్లు, అయోమయమైన వస్తువపరంజిగా మారినట్లు భవదనుగ్ర హవిశేషమున నేనుస్వర్గమునారోహించినట్లు సమ్మోదవారా నోలలాడుచున్నాఁడను. మీయాగమనమువలన నామందిరము పరమపవిత్రమయ్యెను. సాధుపుంగవు లధివసించిన నెలవులేకదా పుణ్యతీర్థము లనిపించుకొనును. మందాకినీ తోయతుల్యములై

మీపాదోదకములు నాశిరమునం జల్లుకొనుటచేఁబునీతుఁడ నైతి
ని. మామకీన జంగమాకృతి తావకీనకైంకర్యమున కధీనమై
యున్నది. నా స్థావరరూపము మీచరణాంకములచే నకలంక
మైనది. నాయంగములు దిశాంతముల నాక్రమించినవైనను
భవదనుగ్రహసంజనితమైన సంతోషమును భరించుకొనసమర్థ
ములు గాకున్నవి. భాస్వద్రూపులైన మీరొసంగిన దర్శనము
వలన గుహాగతమైన తమస్సే కాక నాయంతరాత్మలో నిండి
యున్నతమోగుణమెల్లవిధ్వస్తమైపోయినది. రజోగుణమునశిం
చినదని వచింపవలయునా? మీవంటివారు నాయట్టియల్పునర్థిం
పవలసిన పనియేముండును? ఏదేనికలుగునెడల నానతీయవల
యు. నన్నుఁ బవిత్రుం జేయ సంకల్పించియే యిటకుమీరు వచ్చి
యుందురని తలంతును. నావలన నెఱవేఱవలసిన కార్య
మెద్దియేని లేకున్నను నన్ననుగ్రహించు నిమిత్తమైన నాకొక
పనిఁగల్పింపవలయునని నా వేఁడికోలు. నేనును నాపత్నియుఁ బర
మప్రేమాస్పదయగు నా యీకుమారియుఁ దమయధీనములో
నున్నారము. ఎవరిచే నేమి ప్రయోజనము సాధ్యమో యనుజ్ఞ
యిండు. రత్నహిరణ్యాదికములు వలయునేని కొనిపొండు.'' అని
వినయవినమితాంగుఁడై మేఘనిర్ఘోషముంబురణించు కంఠధ్వని
తో వచింప నతనివాక్కులు గుహాముఖమునం బ్రతిధ్వనించెను.
అంత మునీశ్వరులు హిమవంతునికిఁ బ్రత్యుత్తర మొసంగుటకుఁ

గథా ప్రసంగనిపుణుఁడగు అంగిరోమహర్షిని నియోగింపఁగా నమ్మహానుభావుఁడు "పర్వతసార్వభౌమా! నీవువక్కాణించి నది సర్వమును యథార్థమే. నీవు వాకొనినదానికంటె నెక్కు వగా నొనరించుటకును నీవు సమర్థుఁడవే! నీశృంగములవలె నీ మనఃప్రవృత్తిసైతము మహోన్నతమైనది. స్థావరరూపము ధరిం చిన మహావిష్ణువుగా నిన్ను విద్వాంసులు వాకొందురు. అది సత్య మే. నీకుక్షిలోఁ జరాచరరూపకములైన భూతములనేకములు నెలకొనియున్నవి. నీవు పాతాళపర్యంతము వ్యాపించియుండవేని నాగేంద్రుఁడు మృణాలకోమలములైన ఫణములతో భూమిని మోవఁగలఁడా? నీవు పుణ్యశ్లోకుఁడవు. అమలములై యవిచ్ఛి న్నములైన నీకీర్తిసంతానములను సరిత్ప్రవాహములను సాగర తరంగ మాలిక లడ్డగింపఁజాలవు. భాగీరథీదేవికిం బ్రథమప్రభవ మైన విష్ణుపాదమున కెంతప్రాశస్త్యమో ఆతల్లి ద్వితీయజన్మ మునకుఁ గారణభూతుఁడవైన మహోత్తుంగ శిరస్కునకు నీకును నంతశ్లాఘ్యతయే. శ్రీ మహావిష్ణుమూర్తి సర్వవ్యాపిత్వము త్రివిక్రమావతారమునం బ్రకటీకరింపఁబడినది. నీకయ్యది స్వభావముచేతనే సిద్ధించినది. క్రతుభుక్సమూహములో నొకఁడ వుగానుండి హవిర్భాగముల గ్రహించు నధికారము నీకుఁగలదు కావున హిరణ్మయశృంగ విభ్రాజితుఁడగు సుమేరువునకంటె నీవు దొడ్డవాఁడవు. నీకాఠిన్యము స్థావరకాయమునందే. భక్తి

నశ్రమమైన నీ జంగమశరీరమును సాధువుల నారాధించుటకు సాధనమాత్రముగా నుపయోగింతువు. కావున మా యాగమన ప్రయోజనము నాలకించి మాకోరిక నెఱవేర్పుము. మే మావలం దాల్చిన కార్యము నీదే. నీకుపదేశించుటయే మాభారము. వినుము:—"అణిమాది గుణోపేతమును అస్పృష్టపురుషాంతరమును అగు నీశ్వరశబ్దము నర్ధచంద్రసమేతముగా నేదేవుఁడు వహించియున్నాఁడో, పరస్పర సహకారరూపములగు పృథివ్యాది భూతములనెడు తనమూర్తులచే నీసమస్తవిశ్వమును దురంగములచే యానముంబోలె నేదేవుఁడు నడపించుచున్నాఁడో, యోగివరేణ్యులు క్షేత్రాభ్యంతరవర్తియగు నెవ్వాని వెదకుచుందురో, యెవ్వాని సదమలపదము సంసారవిపద్భయ నివారకమని విద్వాంసులు పలుకుదురో, ఆ సర్వసాక్షి యావరదుఁడా పరమేశ్వరుఁడు నీకడకు మమ్ముం బంపి తనకు నీ పుత్త్రిక నిమ్మని యర్థించుచున్నాఁడు. వాక్కుతో నర్థముం బోలె నా మహాదేవునితో నీకుమారికి అవినాభావసంబంధము ఘటిల్లఁజేయుట నీకు విహితమని మాయాశయము. తనయుల ననురూపవరులకుం గూర్చిన యనంతరము జనకులకు వారింగూర్చిన విచారమే కలుగఁబోదు. జగత్పితయగు శివునికి నీ సుతనొసంగినచో నాయమ సకలభూతములకును జననియగును. దేవతలెల్లరును శంకరునికిం బ్రణమిల్లిన యనంతర మీమెచరణములం దమ

చూడామణుల మరీచిజాలములచే రంజింపఁ జేయుదురుగాత. వధువు పార్వతి. దాతవునీవు. సంధాతలము మేము. వరుఁడు శివుఁడు. ఇట్టి సంవిధాన సామగ్రివలన నీ కులగౌరవమున కెట్టిమహోన్నతి చేకుఱంగలదో కనుంగొనుము. సర్వస్తుత్యుఁడును జగద్వంద్యుఁడును అగు విశ్వగురువునకు నీకుమారిక నొసంగి తత్సంబంధముచే నద్దేవదేవునకు నీవు గురుఁడవు కమ్ము,'' అని యిత్తెంగున భాషించుచుండు నెడఁ బార్వతి జనకునంతికమున నొక లీలాకమలము కేలంగొని దాని దళముల లెక్కించుచుండెను.

హిమవంతుఁ డపుడు సుతను శూలికొసంగఁ గృతనిశ్చయుఁడయ్యును బ్రేయసి మానసము నరయఁగోరి యత్తన్వి యాననము వంక దృష్టిసారించెను. ఇది సముచితమేకదా! ప్రాయికముగాఁ గుటుంబులు కుమారితలంగూర్చి సమాలోచనము సల్పు సమయముల గృహిణుల మతిసాచివ్యము నర్థింతురు. మేనకాదేవియుఁ బతియభీప్సితమున కియ్యకొనెను. పతివ్రతలు భర్తల యిష్టము నెన్నండేనియు నతిక్రమింపరుగదా!

ఇట్లు తన యిల్లాలి యిష్టముం దెలిసికొని హిమవంతుఁడు మంగళాలంకృతయైన కూతుఁ నుద్దేశించి ''బిడ్డా! రమ్ము! విశ్వాత్మకుండగు శివునికి నిన్ను భిక్షగా సమర్పించుటకు నిశ్చయించితిని. మునులీవిధముగా వేఁడవచ్చిరి. గృహస్థాశ్ర

మమువలని ఫలము నాకిపుడు లభించినది,'' అని పలికి ఋషులతో "మునివృషభులారా! త్రిలోచన వధూటి యిదే మీకు నమస్కరించుచున్నది.'' అని విన్నవించి వారికిఁ దన నందనచే సాష్టాంగవందన మాచరింపఁజేసెను. మునులును దమ యీప్సితము సఫలమైనదని సంతసించి గిరిరాజు పల్కులనభినందించి, యంబిక నమోఘవాక్కులతో నాశీర్వదించిరి. సంభ్రమారంభ సంరంభయై వ్రీడాభర స్విన్నసర్వాంగియై నమస్కరించుచున్న పార్వతిని అరుంధతీదేవి కౌఁగిలించుకొని యెత్తి యంకతలమునం గూర్చుండఁబెట్టుకొనియెను. పుత్త్రికా స్నేహవైక్లబ్యపీడితయై తలాలునఁ గన్నీరునించిన మేనకాదేవిం జూచి యరుంధతి, "అమ్మా! మేనకా! నీ తనయకు సాపత్న్యదుఃఖము రవ్వంతయేనియుం గలుగఁబోదు. మృత్యుంజయునిం బోలు నల్లునింగాంచిన నీవెంత ధన్యవు!'' అని బహుభంగుల దేవదేవుని గుణగణములఁ గొండాడి యామెను సంతోషింపఁజేసెను. అంత నత్తాపసులు గిరిజా కల్యాణము జరుగుటకు నాఁటికి నాల్గవదినము ముహూర్తమని చెప్పి, హిమవంతుని వీడ్కొని, సంకేతస్థానమైన మహాకోశీ తీరమున శివునింగలసికొని, కార్యము సిద్ధించినదని యమ్మహానుభావుని కెఱింగించి, యాయనయనుమతింగొని తమ నెలవులం జేరిరి. పశుపతియుం బార్వతి సమాగమము నుత్కలికతో నిరీక్షించుచు దిన

త్రయము గడపెను. కామధ్వంసకుని సైత మీచిత్తవికారములు ... రాధించినవన్న మానవమాత్రులసంగతి చెప్పవలయునా?



---

# గిరిజా కల్యాణము

—: క ల్యా ణ ము :—

——).o:(——

అనంతరము శుక్లపక్షమున సప్తమ శుద్ధిగల తిథియందు హిమవంతుఁడు బంధుసమేతుఁడై కుమారి వివాహదీక్షావిధి నిర్వర్తించెను. వివాహసంబంధ కౌతుక సంవిధానములతోఁ బ్రతిగృహమునందును ముత్తైదువలు వాట్రుపడుచుండిరి. అట్టి యోషధిప్రస్థపురమును హిమవంతుని యంతఃపురమును ఏకరు లోపమేయము లయ్యెను. కల్పవృక్షములచే నలంకరింపఁబడిన వీథులతోఁ, జీనాంశుకములచే నెత్తఁబడిన కేతనములతోఁ, గాంచనతోరణకాంతులతో నా పట్టణము స్థలాంతరముననున్న స్వర్గమువలెఁ బ్రకాశించెను. పలువురు బిడ్డ లుండియు మేనకా హిమవంతుల కాసన్న పాణిగ్రహణయగు పార్వతియొక్కతె యే చిరకాల దృష్టవలెను * మృతోత్థితవలెను పంచప్రాణములు గను నొప్పారెను. ఆశీర్వాద పరంపరలలో మునిఁగి తేలుచున్న యద్రినందన ఒకరి యంకమునుండి మఱియొకరి యంకమునకు

---

* గతజన్మమున నీమె దాక్షాయణి.

మరలుచుండెను. అలంకారములపై నలంకారములం బొందు చుండెను. హిమవంతుని వంశపుంబ్రేమ వ్యక్తిభేదముచే భిన్నమయ్యును నొక్క పార్వతియందే జాలువాఱెను.

చంద్రుం డుత్తరఫల్గునీ నక్షత్రగతుండై యుండఁగా మైత్రముహూర్తంబున మంచుమలపట్టిని పతిపుత్త్రవతులగు బంధుస్త్రీలు పెండ్లికూఁతుం గావించిరి. గౌరసిద్ధార్థముల విన్యాసముగల దూర్వాప్రవాలములతో మిశ్రితమైన కాంతితో శోభిల్లుచు, నాభీదేశమునుండి దిగజాఱిన కౌశేయమును ధరించి కేల *బాణముందాల్చి గిరినందిని తా నభ్యంగనేపథ్యము నలంకరించెను. నూతనదీక్షావిధి సాయకసాంగత్యముం బొంది యా యిందుముఖి బహుళావసానమున భానుకరమున నభివృద్ధిం గాంచు శశాంకరేఖవలె రాజిల్లెను. అంగతైలమును లోధ్రకల్కమునం దుడిచివైచి, యెండువాఱినగందపుంబొడి మెయిన నుంది, యభిషేకార్హవసనము ధరింపఁజేసి, యా బాలను పురంధ్రులు స్నానమం డపాభిముఖముగాఁ గొనిపోయిరి. వైడూర్యశిలాతలములచే సొంపారునదియు, వ్రేలాడుముత్యాల రచనలచే చిత్రమైనదియునగు స్నానగృహమున మంగళ

---

* "శరః క్షత్త్రియయా గ్రాహ్యః
ప్రతోదో వైశ్యకన్యయా
వసనస్య దశా గ్రాహ్యా
శూద్ర యోత్కృష్టవేదనే."—

తూర్యములు మ్రోయ వారామెను సువర్ణకుంభ జలముతో జలకమాడించిరి. మంగళ స్నానవిశుద్ధగాత్రియై, పెండ్లికుమారునిపక్షమువారంపిన ఉద్గమ నీయమును ధరించి, హిమవన్నందన వర్షజలమున నీరాడి పూచిన రెల్లులుగల వసుంధరాదేవి వలెం బ్రకాశించెను. అనంతరము పతివ్రతలు పార్వతిని మణిస్తంభచతుష్టయ విభ్రాజమానమును వితానవితాన విలసితంబును రమణీయాసనరమ్యము నగు నొక మంగళవేదికడకుం గొంపోయి తూరుపు ముఖముగాం గూరుచుండం బెట్టిరి. అలంకరణ ద్రవ్యములు సంసిద్ధములుగా నుండినను క్షణముసేపు పార్వతియెదుట నారమణులు తత్సహజ సౌందర్య సమాకృష్ట దృష్టులై యట్లే చూచుచుండిరి. ధూపంపుటూష్మంబుచేం దడియార్పంబడి పూవులు తుఱుమంబడిన గౌరీకైశికమున నొక మెత్మెల్లాండి గఱికె మొలకలు గల యిప్పపూదండతోంగీలు గంటువైచెను. పార్వతి శరీరమునం దెల్లయగరు నలంది గోరోచనాపత్రభంగములం గీలింప నాలేమ సైకతసీమల వ్రాలిన చక్రవాకములతో జానుమెఱయు గంగానదికాంతినతిక్రమించి మించెను. ముంగురులతోం గూడిన యబ్బాల ముఖశోభ భ్రమరాధిష్ఠితమైన పద్మమును, మేఘశకలసమేతమైన చంద్రబింబమును బరిభవించి సాదృశ్య ప్రసంగమును సైతము దూరముగావించెను. లోధ్రకషాయ లేపనముచే రూక్షమును

గోరోచనావిన్యాసముచే నితాంతగౌరమును నగు హైమవతి కపోలతలమునఁ గర్ణార్పిత యవాంకురము వర్ణోత్కర్షనొంది చూపఱచూడ్కుల బంధించెను. ఒక సకియ గిరికుమారి చరణములకు లాక్షారస లేపనము చేసి 'ఈ చరణముచే నీపతి శిరశ్చంద్రకలను స్పృశింతువుగాక' యని పరిహాస పూర్వకముగ నాశీర్వదింపఁ బార్వతి మారాడక లీలాకమలముతో నాచెలియం గొట్టెను. సుజాతోత్పలములవలె శోభిల్లు నగతనయ కన్నులకు వస్త్రాద్యలంకరణము లొనర్చుసఖులు మంగళకరమని యెంచి కాటుకం బెట్టిరే కాని దానిచే నామె కన్నులకు విశేష కాంతికలుగునను బుద్ధిచే నిడినవారుకారు. ఆభరణాలంకృత యగు నద్రినందన పుష్పించిన లతవలెఁ, బ్రకాశించుచున్న నక్షత్రముల తోడి రాత్రి భంగి, వర్షాగమవేళయం దవతరించు విహంగములుగల నది పగిది విలసిల్లెను. కైసేఁతల వలని కాంతితో, సహజమైన సౌందర్యముతోఁ బ్రకాశించు పార్వతి తనలావణ్య వైభవము నద్దమున స్తిమితాయతాక్షియై చూచుకొని హరసమీప ప్రాప్తియం దుత్కంఠ వహించెను. ప్రియాలోకనమేకదా స్త్రీల వేషమునకు ఫలము!

పిదప మేనకాదేవి మంగళైకప్రయోజనములగు నార్ద్రహరితాళమును, మనశ్శిలను, రెండువ్రేళ్లతోఁగైకొని కర్ణావసక్త కమనీయ దంతపత్రప్రభా శోభితంబగు పార్వతి మోము

పైకెత్తి తన ప్రథమ మనోరథరూపమగు వివాహదీక్షాతిలకము ప్రయత్న పూర్వకముగా దిద్దెను. బాష్పాకులదృష్టులచేఁ గాఁబోలు నాప్రోయాలు గౌరిహస్తకంకణస్థానము నతిక్రమించి స్థలాంతరమున సన్నివేశముం గల్పించుట చూచి చెంగటనున్న దాది స్థానమునకుం ద్రోసి సవరింప, సుమాకరమున నూర్ణతంతు నిర్మితమగు కౌతుకహస్త సూత్రముం గట్టెను. క్రొంబట్టుమేల్త్రి పుట్టముం దాల్చి, నూతనదర్పణమ్మొకటి కేలనూని యాగట్టు రాచూలి నురుఁగుమొత్తములతోఁ మెఱయుపాలవెల్లి వేలవలెను, నిండుచందురునితో నిగనిగలీను శరత్త్రియామవలెను వెలింగెను. అనంతరము కారయితవ్యదక్షయగు మేనక కులప్రతిష్ఠాహేతువగు కుమారిని అర్చితలగు కులదేవతలకు నమస్కరింపఁ జేసి యాభిజాత్యవయోవిశేషమర్యాద నతిక్రమింపక సతుల పాదగ్రహణము చేయించెను. 'అఖండితమైన భర్తృప్రేమను నీవు పొందుదువుగాక' యని వారెల్లరును నమ్రయగు నగతనయ నాశీర్వదించిరి. స్నిగ్ధజనులగు వారియాశీస్సులు సైతము మగని మేన సగపాలు పంచుకొనిన మంచుగుబ్బలితనయచే నధఃకరింపఁబడినవి. సభ్యుఁడును కృతియు నగు హిమవంతుఁడు తన యిచ్చకును విభూతికి ననురూపముగాఁ గృత్యముల నిశ్శేషముగా నొనర్చి సుహృత్తులచే నధిష్ఠితమైనసభయందు పరమేశ్వరు నాగమనముం బ్రతీక్షించుచుండెను.

ఇంతలోఁ గుబేర శైలమున నాదరమేదురహృదయులగు సప్తమాతృక లీపాణిగ్రహణమున కనురూపమైన యలంకరణ ద్రవ్యములను బురశాసనుఁడగు భవుని మ్రోల నుంచిరి. ఈశ్వరుఁ డా మంగళమండనములను స్వీకరింపలేదు. కాని మాతృకలయందుఁ దనకుఁ గల గౌరవభావముకలిమి వానిని స్పృశించెను. పరిణయమునకు సిద్ధుఁడైన యా విభుని పూర్వ వేషమే యిష్టభావాంతరముంబొందెను. భస్మమే సితాంగ రాగమయ్యెను. కపాలమే సింగారపు సిగదండ యయ్యెను. గజాజినమే యుపాంతభాగముల రోచనాంకములు గల దుకూలముగా మాఱెను. నొసటిమొముకలో నెలకొని యచ్చంపుఁ బచ్చగ్రుడ్డుతో వెలుంగు నడిమి కన్నే యరిదళముతో దిద్ది తీరిచిన ముద్దులుమూటగట్టు బొట్టుగా నిట్టనిల్చెను. బుడుత నెలతాలుపు ధరించిన భుజగేశ్వరుల శరీరము లెల్ల స్వస్థలము నతిక్రమింపక యాభరణాంతరత్వముం బొందెను. కాని యాపడగదారుల ఫణరత్నశోభ లట్లే నిలిచియుండినవి. పగటి వేళల సైతము రేయెండలఁ గ్రుమ్మరించు కిరణములతో నుర్ఘ ళించుచు మచ్చ లెట్టివో యెఱుంగని బాలచంద్రుని నిత్యమ నాదల ధరించిన హరునికిఁ జూడామణి గ్రహణ మేటికి?

అద్భుతైకప్రభవుఁడును స్వీయప్రభావమునఁ బ్రసిద్ధ నేపథ్యమును సంతరించినవాఁడును నగు పరమేశ్వరుఁ డాసన్న

గణోపనీతమగు ఖడ్గమున సంక్రాంతమైన తన ప్రతిబింబముం జూచుకొనెను. పిఁపునఁ బులితోలు గల యాలపోఁతు శివుని యెడఁగల భక్తిచేఁ దనపెనుమేను గుంచి చేరువం జేర నంది భుజావలంబియై కైలాసమునువలె నగ్గోపతి నెక్కి దేవదేవుఁడు బయల్దేరెను. శివు ననుసరించి పోవు సప్తమాతృకలు తమ వాహనముల సంచలనముచేఁ గర్ణావతంసము లల్లలనాడ, రేణువులవంటి ప్రభామండలములచే గౌరములైన ముఖములతో నంతరిక్షమును బద్మాకరముం గావించిరా యనునట్లు శోభిల్లిరి. దూరమున మెఱయు మెఱపులవెనుకఁ గొక్కెరబారులతో సాగిపోవు నీలపయోదరాజివలెఁ గనకప్రభలగు సప్తమాతృకలవెనుకఁ గపాలాభరణ యగు కాళి తరలిపోవుచుండెను. శూలికి ముందునడచు గణములు మంగళతూర్యఘోషములు మొరయించిరి. విమానశృంగములం జొచ్చిన యానాదము లాలకించి దేవతలు శివునిసేవింపఁ దఱియయ్యెనని యెఱింగిరి. త్వష్ట క్రొత్తగ నిర్మించిన యాతపత్రమును సహస్రకరుఁడు పరమశివునికింబట్టెను. ఆ ఛత్రదుకూలము తన మౌళిసమీపమునకుం దిగజాఱఁ జంద్రశేఖరుఁడు మున్ను గంగ స్వోత్తమాంగమునం దవతరించు తరుణమునందువలెఁ బ్రకాశించెను. అపుడు గంగాయమునలు నదీరూపముల నుజ్జగించి స్త్రీల యాకృతులం దాల్చియుఁ జామర

ములఁ గేల్దమ్ముల నూని హంసపాతములుగల వారివలెనే కాంతిల్లి శంకరుని సేవించిరి. హవిస్సుతో వహ్నివలె జయ జయ శబ్దములతో శివుని మహిమను వర్ధిల్లఁజేయుచు, ప్రథ ముఁడగు విధాతయు శ్రీవత్సాంకుఁడగు పురుషోత్తముఁడును స్వయముగా మృత్యుంజయుంగూర్చి వచ్చిరి. ఒక్కమూర్తియే మూఁడువిధములుగా భిన్నమైనది. ముువ్వురయందును జ్యేష్ఠతా కనిష్ఠతలు సామాన్యమే. ఒకప్పుడు హరుఁడు విష్ణువున కాద్యుఁడు. వేఱొకప్పుడు హరి శివునకాద్యుఁడు. మఱి యొక వేళ వేధ వారిరువురకు నాద్యుఁడు. ఒక్కొకవేళ ధాతకు వారిరువురు నాద్యులే. పురుహూత ముఖ్యులగు లోకపాలకులు శ్రీ చిహ్నాదికముల వర్జించి వినీతివేషులై శివదర్శన ప్రదానఁ విషయమున నందీశ్వరసంజ్ఞానుసారము వర్తించి ప్రాంజలులై యద్దేవదేవునికి నమస్కరించిరి. శిరఃకంపనముతోఁ గమలో ద్భవుని, వాగ్విలాసముతో వైకుంఠవాసుని, మందస్మితముతోఁ బురందరుని, నాలోకనమాత్రముచేఁ దక్కుంగల దేవతలను, ప్రధానక్రమము నతిక్రమింపక సర్వజ్ఞుఁడు సంభావించెను. సప్తర్షులు ముందే శర్వునికి జయాశీర్వాదములం జేసిరి. శంకరుఁ డపుడు "జరుగనున్న యీ వివాహయజ్ఞమున కధ్వర్యులుగా మిమ్ముఁ బూర్వమే నే వరించితి" నని చిఱునగవు మెఱయ బలికెను. విశ్వావసుప్రముఖులగు ప్రవీణగంధర్వులు త్రిపు

రాసుర సంహారాద్యనేక శివాపదానములు సంకీర్తనము గావించుచుండ నధ్వాంత వికార లంఘ్యుఁడగు తారాధిపఖండధారి ప్రయాణము సాగించెను. తటాభిఘాతములవలన లగ్నపంకములాయెనా యే మన్నట్లు మబ్బుతునకలు గ్రుచ్చుకొన్నకొమ్ములను మాటిమాటికి విదుల్చుకొనుచుఁ, బైఁడిపూఁతలుగల మవ్వంపుమువ్వలు గల్లుగల్లునమ్రోయ, శంకరుని వృషభము తన వీఁపున నద్దేవుని వహించి మొయిలుదాగిం దారిసాగించెను. పసిఁడి పగ్గములచే బలెఁ బురోవిలగ్నములగు హారదృష్టిపాతములచే నాకర్షింపఁబడుచు, నా బలీవర్దము పగవారిచే నెన్నఁడును ముట్టడింపఁబడక నగేంద్రగుప్తమై యొప్పు నోషధిప్రస్థమును ముహూర్తకాలమునం జేరెను.

కుతూహలోన్ముఖులగు పౌరజనులు తదేకదృష్టితో నాలోకింప జీమూతనీలగ్రీవుఁడగు నద్దేవుఁడు విష్ణుమార్గము నుండి దిగి పురోపకంఠమున నున్న గిరిపార్శ్వ ప్రదేశముం జేరెను. సర్వజ్ఞుని యాగమనకారణమున సంతసిల్లిన గిరిచక్రవర్తి వికస్వరపక్షములగు తనకటకములతో నుంబోలె, నైశ్వర్యవంతులగు బంధుజనములచే నధిరూఢములైన గజబృందములతో హరు నెదుర్కొనెను. దిగంత సంక్రాంతఘోషములగు రెండు జలప్రవాహములు భిన్నైకసేతువులై యెదురగు వడువున

దేవమహీధర వర్గములు రెండును, బట్టబయలుగాఁ దెఱచిన పుర ద్వారమున నెదురయ్యెను. త్రైలోక్యవంద్యుఁడగు పరమేశ్వరుఁడు తనకు నమస్కరించు టారసి భూమిధరుఁడు సిగ్గుపడెను. తత్పూర్వమే శివుని మహిమచేఁ దాను దద్దయు వినతశిరస్కుఁడగుట గుర్తింపఁడాయెను. చీలమండల లోఁతున నెల్లెడఁజల్లబడిన పూలప్రోవులు గుబాళించు వలపులతో సిరులకునికిపట్టై మురువుగుల్కు నంగడివీథులు గడచి, మక్కువకలిమి విరియఁబాఱిన మోముఁదమ్మిగల వడఁకుగుబ్బలి ముందునడువ ముక్కంటి హిమవన్మందిరముం బ్రవేశించెను.

అప్పట్టునఁ బురశాసనసందర్శనలాలసలగు పురసుందరులన్యకార్యముల వర్జించి ప్రాసాదమాలలయం దొనరించిన చెయిదము లచ్చెరువుం గొల్పును. వీడిపోయిన క్రొమ్ముడితో, జాఱిన విరిసరముతో నొక మచ్చెకంటి తన కేశపాశము నొక కెంగేల గట్టిగాఁబట్టుకొని గవాక్షముకడ కరుగుదెంచెను గాని ముడివేయ నాలోచింపనేలేదు. గట్టువాలు చేతి పట్టున నున్న తన పాదాగ్రమును లాక్షారస మాఱకమునుపే జరీలున లాగుకొని యొక వన్నెలాఁడి హొయలునడక నెగ్గించి యురవడించిన నడకతోఁ గిటికీకడ కేగుచు మార్గము నలక్తాంక చిహ్నితముగా నొనరించెను. వేఱొక యించుఁబోఁణి కుడికంటికిఁ గాటుకం గీలించి దాపటికంటఁ గజ్జలమునిడకయే కేల వాగఱనట్లేఁ

వహించి వాతాయనసాన్నిధ్యముం జేరెను. మఱియొక ముద్దు గుమ్మ మణులతో సగము మొలనూలు గ్రుచ్చి త్వరితగతి లేచినడువ నడుగడుగునకును రతనములు జాఱిపోయి తోరణ గండికడ కేగునప్పటికి బొటనవ్రేలంజుట్టిన దారము మాత్రమే మిగిలెను. విలోలనేత్రభ్రమరములును విమలాసవ గంధగర్భములునైన నిరంతరకుతూహల సీమంతినీ ముఖములచే వ్యాప్తాంతరములైన గవాక్షములు కమలాభరణములు గల వానివలెఁ గాంతిల్లెను. తోరణాలంకృతమై పతాకవ్యాప్తమునై వెలుఁగొందు రాజమార్గముం బొంది యింటుమకాళి సాగిపోవ నయ్యెది పగలైనను నగర ప్రాసాదశృంగములు చంద్రికాభిషేకమున ద్విగుణీకృత దీప్తిమంతములై తేజరిల్లెను. ఆ పరమేశ్వరుని భువనమోహన సౌందర్యమును దమవిలోచనములం గ్రోలుచున్న పౌరాంగనలు విషయాంతరములం బొందరైరి. ఆ యోషారత్నముల శేషేంద్రియవృత్తి చక్షురింద్రియముం బ్రవేశించెనో యను నట్లుండెను.

"ఈ దేవునికొఱకే కోమలాంగియగు నపర్ణ దుశ్చర తపశ్చర్య కావించెను. ఇదియుక్తమే. ఈ భగవానుని దాస్యము నైనను బడయఁగలిగిన నారి కృతార్థురాలు. ఈలోకగురుని యంకశయ్యాభాగ్యము గడించిన పడఁతి ధన్యురాలని వచింప వలయునా! స్పృహణీయశోభాప్రాభవముగల యీమిథునము

గొండొరులతోఁగూర్చుకున్న విధాత వీరి యెడఁగావించిన రూప నిర్మాణ యత్నము నిష్ఫలమైయుండును. కుపితుఁడై యాతఁడు కుసుమాయుధుం గాల్చినాఁడనుట కల్ల. నిజముగాఁ గాముఁడీ వామదేవుంజూచి యీతని సౌందర్యము నారసి సిగ్గుపడి తానే తనశరీరముం బరిత్యజించెనని తలంతును. చెలియా! నేలఁదాలిచి తలయెత్తిన శైలరాజు మనోరథప్రార్థితమగు సర్వజ్ఞసంబంధమున నుచ్చైస్తరశిరస్కుఁడు కాఁగలఁడు. సందియము లేదు'' అనిపలు తెలుంగులఁ దమలోదాము భాషించుకొను నయోధ్యావధి ప్రస్థ విలాసినీజనుల కర్ణమధుర కథావిశేషముల నాలకించుచు జంద్రశేఖరుఁడు హిమవంతుని యాలయముం జేరెను. మహిళామతల్లులు మంగళార్థమై పిడికిళ్లతోఁజల్లిన పేలాలు వారి కేయూరముల యొరపిళ్లచేఁ బొడియై యాలయము నల్గడల వ్యాపించియుండెను.

శరన్మేఘమునుండి సహస్రాంశుని చందంబున, మహోక్షమునుండి శివుఁడు మాధవుఁడు చేయూఁత యొసంగ దిగి, కమలాసనుఁడు ముందునడువ నద్రిపతికక్ష్యాంతరములం బ్రవేశించెను. ప్రశస్తారంభము నుత్తమ ప్రయోజనము లనుసరించు కరణి నీశ్వరుని వెనువెంట సప్తర్షి ప్రముఖులగు పరమర్షులును ప్రమథగణములును నడచి గిర్యాలయముంజొచ్చిరి. విరూపాక్షుఁ డంతట విష్టరస్థుఁడై శాస్త్రమర్యాదానుసారముగ నగేం

ద్రుఁ డొసఁగిన రత్నయుతమైన యర్ఘ్యమును మధుసంకలిత మైన గవ్యమును నూతనదుకూలములను సమంత్రకముగాఁ బరిగ్రహించెను. విస్ఫుటఫేనరాశియగు సముద్రుఁడు నూతన చంద్రపాదములచే వేలాసమీపమునకు వలె, దుకూలధారి యగు ధూర్జటి వినీతులగు నవరోధదక్షులచే వధూసమీపము నకుం జేర్పంబడెను. శరత్తుతోఁగూడిన లోకమువలెఁ బ్రవృద్ధా ననచంద్రయగు నక్కుమారిం గూడిన శివుఁడు ప్రఫుల్లచక్షుః కుముదుండును బ్రసన్నచేతస్సలిలుండు నై ప్రకాశించెను. అన్యో న్యాలోలములును, బరస్పరసమాగమములయందుఁ జకితము లును, గించిద్వ్యవస్థాపితములై యుపసంహృతములును నగు గౌరీ శంకరుల విలోచనములు సిగ్గుచే ముకుళీభావముం గాంచెను. ముక్కంటికి జడిసి యక్కతమునఁ గొండరాచూలి మేనడాఁగిన చెఱకువిలుకాని ప్రథమాంకురమో యనం దగిన యద్రితనయ కెంగేలిని శైలగురువు సమర్పింప అష్టమూర్తి గ్రహించెను. ఉమ కపుడు పులకాంకురోదయ మయ్యెను. శివుఁడు స్విన్నాం గుళి యయ్యెను. మనోభవుని ప్రవర్తనము వారియుభయుల యెడ సమముగా విభక్తమైనట్లుండెను. ప్రయుక్త పాణిగ్రహణు లైన యవ్వధూవరులే వీరిసాన్నిధ్యయోగమున నుత్తమ కాంతి విభ్రాజితులై వాసిఁ గాంతురన్న నిఁక నీదంపతుల శోభాలాభ మిట్టిదని వర్ణింప నలవియగునా!

ఉద్గతజ్వాలలు గల కృశానుని కమ్మిఘనము ప్రదక్షిణముగావించుచు మేరుపర్వతోపాంతముల యం దన్యోన్యసంసక్తమై వర్తించు నహస్త్రియామలవలెఁ బ్రకాశించిరి. పరస్పరసంస్పర్శనిమీలితాక్షులగు నాజాయాపతుల నట్లగ్నికి ముమ్మారు ప్రదక్షిణము చేయించి పురోహితుఁడు ప్రజ్వలచ్ఛిఖా వహ్నిలో లాజహోమముం జేయించెను. కమ్మనివాసన లీను లాజధూమాంజలిని నగరాజనందన గురునాదేశమునఁ దనమోమున వ్యాపింపఁజేయ, నాపొగలపాయ లాబాలచెక్కిళ్లపైఁ బాఱికి క్షణకాలము కర్ణోత్పలత్వమును వహించెను. ఆచారప్రాప్తమైన యాధూమగ్రహణమునలనఁ బెండ్లికుమారిత మోము చెమర్చెను-గండరేఖలు పాటలితములయ్యెను - యవావతంసము వాడువాఱెను. "వత్సా! నీపివాహమున కీయగ్ని హోత్రుఁడేకర్మసాక్షి. నిర్విచారవగునీవు నీభర్తతో ధర్మానుష్ఠానము నాచరింపుము." అని పురోహితుఁడు వధువుంగూర్చి వచించినంతనే యావాక్కులను, వేసవివెట్టచే వాడిన పంటవలఁతి తొలివాన నీటిం ద్రావుపోలిక, ఫీనుల విలోచనాంతములవఱకును విరియఁజేసి భవానిపాన మొనర్చెను, ధ్రువుఁడును బ్రియదర్శనుఁడునగు భర్త ధ్రువదర్శన మొనరింపుమని నిర్దేశింప నాననము నెత్తి పార్వతి 'చూచితి' నని వ్రీడాభరమున హీనకంఠియై యెట్లో వచించెను. ఇట్లు విధిజ్ఞుఁడగు పురోహితునిచేఁ బాణిగ్రహణోప

చారము నిర్వర్తింపఁబడినపిదప జగత్పితలగు నవ్వధూవరులు పితామహుఁడగు పద్మాసనస్థునికి నమస్కరించిరి.

"కల్యాణీ! వీరప్రసవవు గమ్ము" అని విధాత వధువును దీవించెను. కాని యాతఁడు వాచస్పతియయ్యు అష్టమూర్తియగువరు నేమనిదీవింతునా యని ప్రార్థనీయార్థవిచారస్తిమితుఁడై యట్టె నిలిచిపోయెను. నమస్కారానంతరము పుష్పరచనాదికములచేఁ బొలుపులు గులుకు చతురస్రవేదిం జేరి కనకాసనస్థులై యాదంపతులు లోకప్రసిద్ధము వాంఛనీయము నగు నార్ద్రాక్షతారోపము ననుభవించిరి. ముత్తియముల వరుసలవలె తేకులయంచుల నంటి జోకఁగూర్చు నీటిబిందువులతో నొప్పారునదియు నాయతనాళదండముతో హారువు మెఱయునదియు నగు విమలాతపత్రము నాగారిశంకరులకుఁ గలుములజవరాలు వహించెను. సరస్వతి సర్వోత్తముఁడగు వరుని సంస్కారపూతమగు వాఙ్మయవిశేషములతో స్తుతించెను. వధువును సుఖగ్రాహ్యనిబంధన మగు వాగ్వైఖరులతో స్తోత్రముగావించెను. సంధులలో వృత్తిభేదముం బ్రకటించుచు, నాయారసములకనువైన రాగవిన్యాసముం గావించుచు, లలితములైన యంగవిక్షేపములతోఁ జూపఱ చిత్తములఁ జూఱలాడుచు నచ్చరలాడిన యాద్యప్రయోగమును ముహూర్తకాల మాదంపతులు చూచిరి. అనంతరము పరిణీత భార్యుఁడగు

హరుని కడకుఁ గిరీటబద్ధాంజలులైన దేవతలేగి ప్రణమిల్లి శాపావసానమున లబ్ధశరీరుఁడైయున్న పంచశరుని సేవ నంగీకరింపుమనికోరిరి. విగతమన్యువగు నాభగవంతుఁడు దనయెడ సైతము మీనకేతనుని సాయక వ్యాపారము జరుగుట కనుమతించెను. కార్యవిదులు కాలమెఱిగి ప్రభువులతోఁ జేయు మనవి ఫలసిద్ధి గాంచకుండునా? అంతటఁ బరమశివుఁడు విబుధ గణములకు సెలవిచ్చి హేమ మయ పూర్ణ కుంభ విభ్రాజితంబును, దివ్యాలంకరణ శోభాసనాథంబును, స్థండిల శయ్యా సంయుక్తంబును నై వెలయు కౌతుకాగారమును నగరాజకుమారిం జేపట్టి ప్రవేశించెను. క్రొత్త పెండ్లికూఁతురగుటచే నొదవిన నునుసిగ్గొకమేలు సోయగముంగూర్ప, శయనసఖులకు సైతము పూనికతో బదులుమాట పలుకుచు, దయితుఁడెంత తివిచినను మోము నడ్డము త్రిప్పు గౌరిని హాస్యరసాధి దేవతలగు ప్రమథుల వదన వికారములచే నప్రకాశముగా నవ్వించుచు శంకరుఁడు కొన్ని దినము లత్తగారింటఁ గడిపి ప్రాప్తానందుఁడయ్యెను. కొంతకాలమునకు గౌరీశంకరులకుఁ గుమారుఁడు జన్మించి తారకుని వధించి విశ్వకల్యాణ సంధాయి యయ్యెను.

---